సీ. బ్రహ్మకుఁ బట్టంపు♦రాణివాసం బయ్యు, రాజసక్రీడాబ్ధి♦రతులఁ బోక
జగదేకసౌందర్య♦సౌభాగ్య యయ్యును, నణుమాత్రమును గర్వ♦గుణము లేక
సంపూర్ణ యౌవన♦సంపద గలిగియు, మదవికారస్ఫూర్తి♦పొదలనీక
వ్యాహారసింహాస♦నారూఢ యయ్యును, బహువిధవ్యావృత్తిఁ♦బ్రౌఢ గాక
తే. మగనిముందఱఁ దన మహా♦మహిమ లెల్లఁ, గానఁబడకుండ నడఁకువ♦గలిగి కించి
దవనతాననయై పొలు♦పారఁ గన్ను,గంవమీలకు నింకకడఁ ♦ గఱపి కదియ. 7

క. ఏతెంచునపుడు పాదుక, లాతలికతన్వాంతరమున ♦ నటు విడిచి కరా
నీత విపంచీ మదశుక,పోత స్ఫటికాక్షసూత్ర ♦ పుస్తక యగుచున్. 8

క. పరిజనుల ననిపి నాథుని, పరిసరమున కేగి యతని♦పంపున మణిపిం
జరిత ఖగద్గీతం బగు, సరిగద్దియ నుండునట్టి♦సమయమునందున్. 9

సీ. మోముపున్నమచంద♦మామ వెన్నెలఁ గాయ, జెందంపుఁ గెంపుమ్మి♦గ్రిందుపడునొ
వాలుఁజూపనియెడు♦వేలుపు తేనిక్రై, దువ్వాయగట్టుగ♦ట్టువిడుచుఁబడునొ
కొప్పనుచీఁకటి♦గుంపు గప్పుకొనంగఁ, దలఁపు తెన్వెరిద్రో♦వఁదప్పి పడునొ
రాయుంచనడపుల♦రాయిడిఁ బాల్మితా,మరతూఁపు దుమురుగా ♦ మరలఁబడునొ
తే. నలువ తనుఁగొల్వ వచ్చిన♦పలుకుఁ జెలువ, చెలువము నయముచువలరాజు♦చిలుకుములికిఁ
దలఁకి మిన్నక యొక కొంత♦తడవు నిలిచె, మునులు దమతమ మొగములు♦గనుఁగొనంగ

తే. అరియుఁ దాఁగాంచి సభ్యులా♦స్లోకమందఁ, దగవుఁ దలపోసి చిత్తంబు♦బిగియఁబట్టి
స్వస్వరూపవికారైక♦సౌఖ్యసృష్టి, మఱుఁగు వెట్టుచు నొకకొన్ని♦మాటలాడి. 11

తే. సరస సల్లాపములఁ బ్రొద్దు♦చాలఁ బోవె, ననుచు వేల్పుల మునుల నె♦య్యమున ననిపి
తాను వాణియు లోని సౌ♦ధంబు మీఁద, కరిగి యచ్చట నిల్లని ♦ యాసతిచ్చె. 12

శా. వాచాగోచర మప్రతర్క్యము విని♦ర్వ్యాంధ్యం బసాధారణం
శాంచోద్యం బఖిలోక నుప్రోమన♦ర్వాయంబు వర్ణింపఁగా
నీచెల్వం బిది నిక్క మట్లయినఁ గా♦నీ నాకు నీవంక వాం
ఛాచాపల్యము దీరనేరదు మనో♦జక్రీడలం గోమలీ. 13

క. నాకోరిక నీడేరఁగఁ, గైకొనవలె నీవు ప్రేమన♦గౌరవకృతభా
షాకృతులు నటాటి నటువలెఁ, గైకొంటివ యేని చెప్పఁ♦గలదే మనినన్. 14

క. తనపాతివ్రత్యమునకు, ననుకూలముగాఁగ మగని♦యాజ్ఞకు లోనై
కనుపట్టి వాణి శతిథా,గ్వసజాసన లగుచు సలువ♦వశి చేరంగన్. 15

ఉ. అందున కెంతయుం బ్రబ మద♦మందుచుఁ బుష్పితవల్లులందు నిం
దిందిరశాబకంబు పువు♦దేనియఁ గ్రోలెడు రీతి నార్యురా
బొందె సుధాధరగ్రహణ♦భూరి సుఖంబుల నొందుచుఁ గ్రాతా
నందుఁ డసంగ నొప్పెనఁగ ♦ నాఁడు మొదల్ కథల న్విధాతయున్. 16

శా. ఆరామంబులఁ గేలిశైలముల సౌ♦ధాగ్రంబులన్ స్వర్ణదీ
తీరోపాంత నికుంజ పుంజములలో ♦ దేశంబుఁ గాలంబు నా
చారంబు న్వివరింపఁగా మఱచి మ్లే♦చ్ఛాతాంధకారాంధుఁడై
నీరేజాననుఁ డిచ్చ నుండె శతవా♦ణీభోగ నిర్మగ్నతన్. 17

సీ. ప్రొక్కిన నొకలేమ ♦ మోమెత్తఁగాఁ జేయుఁ, దిట్టఁ గూరిమి నొక్క ♦ తీఁగఁబోఁడి
తలవట్టుకొను నొక్క ♦ తరుణీలలామంబు, పాన్పుపై నెదలించు ♦ నొక్కయింతి
పట్టకు మని యాన♦ పెట్టు నొక్క వధూటి, యేడుచు నొక్క పూ♦ర్ణేందువదన
ముసుఁగు వెట్టుచు నొక్క ♦ ముద్దియ ఘనదించు, సిగ్గు లేదను నీకుఁ♦ జెలువ యొకతె

తే. మఱియుఁ గోపించి వలసిన ♦ మాడ్కి నుండు, వారిజాక్షులఁ దగినట్లు ♦ గారవించి
రతిసుఖంబులఁ [illegible]నో♦రంత ప్రొద్దు, నజుఁడు మన్మథ రాజ్యసిం♦హాసనమున. 18

క. తరుణీశతకము బింబా, ధరమాధుర్యంబు లాను♦తఱిఁ దమలోనన్
బరమేష్ఠి నాల్గుమోములు, వరుసలు వెట్టుకొనుఁ జెప్ప♦ వశమే కూర్మిన్. 19

సీ. అధరపల్లవ మాన♦ సంగంబు మఱచు దం, తక్షతంబునఁ గొంత ♦ తలఁపు గలుగుఁ
బరిరంభణంబునఁ ♦ బరవశుండగు నఖం, బులు నాటఁ జెనకినఁ ♦ దెలివినొందు
బహుబంధరతికి లో♦బడిపోక్కు గళరవ, శ్రవణంబుచేత ని ♦ చ్చరికనొందు
సురతాంత సుఖమున♦సోలుఁ దాంబూలంబు, సేయింప నించుక ♦ సేద దేఱు

తే. జలకమాడును దివ్యవ♦స్త్రములు గట్టు, దివ్యగంధంబు లలఁదును ♦ దివ్యపుష్ప
మాలికలు దాల్చు నమృతంబు♦ గ్రోలు మగుడ, బాలికాసంగ సౌఖ్యాబ్ధి♦ నోలలాడు.

ఉ. తోరపుఁగోరిక, ల్నగవు♦ తోడి మొగంబును జిక్కనడ్డ శ్రొం
గారపుఁ గొప్పు, క్రొంజెమట♦ గాత్రమునం దడము, సందడించు ని
ట్టూరుపు గాడ్పు, వేడుకలు♦ నుబ్బినదేహము, సోలఁ జూపు, నొ
ప్పారుట గాని నల్వకొక♦యుప్పును సారెట లేదు కూటమిన్. 21

క. ఈమాడ్కి నిదియు పనిగాఁ, గామాంధుం డగుచు నున్న♦ కార్యము లెల్లన్
బోమొత్తి పుణ్యపాపము, లేమియుఁ దలఁపక సుఖించు♦ నెడ వారలకున్. 22

శా. క్రూరు ల్దుర్మార్గులు దోషకాములు జగ♦ద్ద్రోహు ల్మహాభీషణా
కారు ల్ధర్మవిరోధు లన్యరమణీ♦ కామాంధకారాంధు లా
చారభ్రష్టులు లోకకంటకులు శ♦స్త్రవ్యగ్రబాహు ల్కృపా
దూరు ల్మప్పదివేల రక్కసులు దో♦ర్జోఁ బుట్టుచుం దండ్రితోన్. 23

## బ్రహ్మకోమటులదుష్టచేష్టలు.

సీ. చెఱపట్టి తెత్తుమో ♦ శ్రీమహాలక్ష్మిని, బింకి గావింతుమో♦ వెండికొండ
ద్రింగుదుమో పట్టి♦ మిహిరమండలమును, ద్రావుదుమో సము♦ద్రంబు లెల్లఁ

బన్నగకులసార్వ ♦ భౌము నాడింతు మో, పెకలింతు మో ధాత్రిఁ ♦ బెకలిపడఁగఁ
దన్నుదు మో మృత్యు ♦ దంష్ట్రలు విఱుగంగ, నరగునఁ జెఱుతు మో ♦ జమునిలజ్జ

తే. నేఁడుకొండలుఁ బెఱికి వేఁ ♦ టాడి కడిమి, గగనమండల మొరయంగ ♦ నెగరవైచి
బంతులాడి చరింతుమో ♦ పనుపు మమ్ముఁ, దండ్రి! వలసిన పని కన్నఁ ♦ దమ్మిమాలి.

వ. నెమ్మనంబున నుమ్మలించి కమ్మవిల్తుని యలరమ్ముల జిమ్ముచీఁకట్లు గ్రమ్ముటం జేసి దుర్మ
దులుఁ గ్రూరకర్ములగు కొడుకులం గంటినే యని కటకటంబడి భువనంబులకు వెక్క
సులగు రక్కసుల దిక్కుఁ గనుంగొని గగనకర్పర పరివేధి తుంగ శృంగ శృంగాటకం
బును నుదీచ్యవాచీ ప్రాచీప్రతీచీ సమీచీన పరిఖీభూత గంగా గౌతమీ సముద్ర
ముద్రిత మార్గంబును నిరర్గళ నానామృగ సంకులమధ్యంబును నగు వింధ్యంబు సకుం 25
బొండని నియమించిన.

ఉ. మించిన వేడ్క రక్కసులు ♦ మీసలు దీటుచు, దిక్కుటంగముల్
చించుక పాఱ నార్చుచు మ ♦ షీమలినాంగ విసీలిమ చ్ఛటా
వంచిత భానులై కయిదు ♦ వల్లళిపించుచు లోకమెల్ల భ
క్షించెద మంచు వింధ్యగిరిఁ ♦ జేరఁగ వచ్చిరి దండ్రి పంపునన్. 26

ఉ. అందొక దుర్గమస్థలము ♦ నందు నివాసముఁ జేసి జంతువా
శిం దెగటార్చి మ్రింగుచు ఋ ♦ షిప్రమదావళిఁ బట్టుకొంచు సం
క్రందనముఖ్య దేవనగ ♦ రంబులఁ గాల్చుచు నాత్మబోధ ని
ష్ఠం దపమాచరించుముని ♦ సంహతి డెందము గందఁజేయుచున్. 27

మ. పురుషుం డన్న వధించి, కాంత యనిన ♦ న్భోగించి, యర్థంబులన్
సరగం జేకొని, మత్తచిత్తు లగుచున్ ♦ సర్వంబు నేకంబు సే
సిరి వర్ణాశ్రమ ధర్మము, ల్బుధుల గా ♦ సింబెట్టి చార్వాకమా
ర్గరతుల్వోలె శరీరసౌఖ్యపరతం ♦ బ్రత్యక్షసిద్ధాంతులై. 28

మ. కులశీలంబులు జాతిభీతులు నను ♦ క్రోశత్రపాహేయశం
కలు దూరంబులు సేసి యిచ్చల నమ ♦ గ్రస్ఫూర్తి న ర్తించువా
రలవైయి పోయిరి కాని రక్కసు లసా ♦ రక్రూరసంసారమో
హాలతాబద్ధులు గాక యున్న నపవ ♦ ర్గానందముం జెంద రే. 29

శా. భాండాగారము లెల్ల నన్యధనము ♦ ల్బందీగృహప్రాపితా
చండాలావధికాంత లాత్మకులమో ♦ షారత్నముల్, సత్క్రియల్
చండక్రీడలు, సర్వజంతువులు భో ♦ జ్యశ్రేణి, కాదంబరీ
భాండవ్రాతము పేయమై, దనరఁ ♦ బాపస్వాంతులై త్రిమ్మరన్. 30

శా. ఆబాధల్ పడలేక భూరమణి శో ♦ కాక్రాంతయై యూర్ధ్వవీ
థీబద్ధారుణపాణిపద్మములతో ♦ దేవా! జగం బెల్ల ర

తాఁబుద్ధిఁ వివరింపు నీసుతులచేఁ ♦ గాలెంజుమీ యంచు భా
షాబద్ధుం డగు బ్రహ్మదేవుఁ గని వి♦జ్ఞాపించె ఘోషించుచున్. 31

క. ఆయార్తనాదమునకుం, దోయజగర్భుండు కరుణ♦తో భూదేవిన్
డాయంగఁ బిలిచి వెఱవకు,మీ యనిమిషమున నీకు ♦ నెవ్వో పరింతున్. 32

## బ్రహ్మకు నుగ్రుఁ డనుకొడుకు కలుగుట.

క. అని కోపములపైఁ బుట్టిన,కినుక సహింపంగ లేక ♦ కెరలినఁ గోపం
బున నుగ్రుం డనుతనయుఁడు, జనియించె ననుస్తభూత♦జాలము బెగడన్. 33

చ. అతనికి నుగ్రసింహరథ ♦ మస్త్రచయంబును వజ్రకంచుకా
న్వితముగ నిచ్చి నాసుతులు ♦ నీసహజన్ములటంచుఁ జూడ న
ద్భుతగతి నంనజుం డనిమి ♦ దైవతకోటులు నింగిఁ బొంగ భూ
సతికిఁ బ్రియం బొనర్పు మని ♦ సారసగర్భుఁడు పంప నాతఁడున్. 34

## బ్రహ్మపంపున నుగ్రుఁడు తనయన్నలగు రక్కసులఁ జంపుట.

ఉ. కోపన నార్చినం దెసలఁ♦గుంజరము ల్వెదరెం, ధనుర్గుణా
రావమునం గలంగె జల♦రాశి, వడంకె రథాంగతీవ్రసం
రావమునం గులక్షితిధ♦రంబులు,రథ్య మృగేంద్ర సాంద్ర హే
షావలి బ్రక్కలయ్యె హరి♦దంతము, లేమని చెప్ప నత్తఱిన్. 35

తే. తన్ను ధరణికిఁ బొమ్మన్న ♦ ధాత నోటి,మాట నోరనె యుండ భూ♦మండలంబుఁ
జేరఁ జనుదెంచె సింగంపుఁ♦ దేరిజోదు, వింధ్యగిరినున్న రాక్షస♦వితతిమీఁద. 36

శా. ఆఘోరాసురు లంతయుం దెలిసి గం♦ధానేకపానేకవా
హాశ్వ స్యందన బృందము ల్గొలువఁ జి♦త్రాయుధాత్తమై, కార్ముకా
మోఘాస్త్రంబులు దాల్చి హేమరథము ♦ ల్మోదంబుతో నెక్కి గం
గోఘుం బెత్తిన ధూళిచే నడుసుగా ♦ నత్యంత గర్వాంధులై 37

క. బలములు దీర్చిరి నడిచిరి, బలవంతుం డైన యుగ్రు♦పై నేచి బలా
బలచింత లేక రాక్షస, బలములు రఘురాము మీఁదఁ♦ బైకొను రీతిన్. 38

క. ముందటఁ గాలుబలంబు పి,యుందం దురగంబు లాపి♦యుందం గరులున్
స్యందనము లందుపిఱుఁదం, గ్రందుకొనంగ నిలిపి నడుమఁ♦గా వెడఁగయ్యెన్. 39

మ. గరళం బుద్ధతి నారగింపఁ జనుమ♦గ్రవ్యగ్రవిస్ఫూర్తి, సా
గర మాపోశన మొత్తుకుంభజుని రే♦ఖన్ ధ్వాంతసంతాన ను
స్థిరతం దీర్చు దినేంద్రు చందమున, నా♦నీసం గనుంగొంచు భీ
కర వేగంబునఁ దాఁకె నుగ్రుఁ డవుడు♦గ్రం బైన కోపంబునన్. 40

క. చదిపెం గాలుబలంబులఁ, గదిమెఁ గుఱ్ఱంపు పౌజు • గగ్గులకాడై
చెదరంగ గంధగజముల, మదమడఁచెం జండవీర • మండలిఁ దాఁకెన్. 41

క. విమునక పట్టిన మునుమున్, గడదేఱిచి బలము రెండు • గా నొనరించెన్
వడి నా రెంటికి నడుమన, వెడలెన్ మఱిసోమసూర్య • వీథులుగాఁగన్ 42

క. చెదరిన సేనల నన్నిటిఁ, గుదురుకొనం దోలి చుట్టు • కొని వడి నేసెన్
మదకరుల హయుల భటులను, గదనంబున మడిసి చాప • కట్టుగఁ గూలన్. 43

శా. ఆ మోఘాగ్రణిచేత నిట్లు తమసై • న్యంబు ల్పరాపంచలై
పాయల్వాఱియు నేటుపోటుల భయ • భ్రాంతంబు లయ్యెన్ సమి
ద్వ్యాయుక్తాంగములయ్యెఁ దమ్ము శరణం • బు ల్వేఁడియుం దూలఁగా
సాయంసూర్య సమాన నక్త్రములతో • సక్రోధులై రక్కసుల్. 44

క. విఱిగిపఱచు సైన్యంబుల, వెఱపెల్లను దీర్చి చాలు • విక్రమగరిమన్
నెఱయుంగ నుగ్రుఁ దాఁకిరి, యురవడి నార్పులును జొబ్బ • లుఱుములఁ బగడన్.

క. ఆ తుములమునకుఁ దెమలక, భూతలము వలంకె నడుమ • పుత్రుం డెదుటన్
యాతెఱఁగున నసురులు నిర్ఘాతసదృశ శరపరంప • రలు వడిఁ గురియున్. 46

క. పసిన శరములు దుమురుగఁ, జేసి యురగ్యాంబు దాప • తెఱఁ గాదివినయ
ట్రాసుర సైన్యము వీరా,గ్రేసరుఁ డుగ్రుండు విశిఖ • కీలలఁ బొగిలెన్. 47

క. తా నేసిన శరములు దా,నవులమునఁ బడ్డమిడుత • లట్లు శరనిధిన్
సోనలుగా వర్షించిన, వానలక్రియ వారిమీఁద • వచ్చి పోసెన్. 48

శా. క్రోధాగ్ని ప్రభ నీతి శోణరుచి దృక్ • కోణంబులం జిందఁగా
వేధోండంబు గలంగ నార్చి శరము • ల్వేవేగ కోదండవి
ద్యాధౌరేయత మీఱ నేసి మనుజా • హారాసుదేహ స్రుధా
రాధారాతతి విధూళిపాళిగ న్మృగేం • ద్రస్యందనుం డుద్ధతిన్. 49

క. కోపవరు లప్పురుని, బాణపరంపరల నొప్పిఁ • బడ్డరై రి కులి
క్షోణీధరములు కుంభ, ద్రోణాసారమునఁ గలఁగి • తొలఁగని భంగిన్. 50

వ. మఱియును.

శా. దిక్కుల్ గిక్కురులంగఁ జక్రగుణసం • దీప్తధ్వను ల్మ్రోయఁగా
రెక్కల్ వచ్చిన కాలసర్పముల పే • ర్మిం గంకపత్రంబులన్
జొక్కంబైన నిశాతబాణముల నా • జో దేసి చేతాళముల్
గ్రక్కుల్ గ్రింగఁగఁ గ్రొత్తనెత్తురుల వాఁ • గు ల్పాఱఁ గ్రవ్యాదులున్. 51

ఉ. పసిన సీసువ్రుట్టి యసు • రేశ్వరు లన్నియు నుగ్గుసేసి యు
ద్భాసనుపుత్రుఁ జూచి భువ • నావళి నెన్నఁడు నిన్నుఁ గాన మ

స్థిరత వహించె ధాత్రియు, బుధమిత్రజ మిచ్చె జరించె, రాక్షసో
త్కరము రణంబునం హరిరథప్రవరాహుతిచేతఁ గూలినన్. 61

వ. అమ్మహారణస్థలంబున వారణంబులయట్టలు కట్టలు వడుటంజేసి తొట్టిన నెత్తురు మడువులం దెట్టువలు గట్టిన యంపకట్టియలం దెప్పలుగట్టుకొని యోడం దలపెట్టు బిడ్డల మెడ్డాటనంబునకు మనంబున ఘనంబగు వేడుక వొడమఁ బెద్దయుంబ్రొద్దు ముద్దాడు శాకినీ ఢాకినుల కలకలంబును విచ్చలవిడిం బచ్చిపొలసుఁ దిని వెగటుగుటం జేసి తొడవులనెడలి పడిన పద్మరాగంపుఁ గుప్పలు నిప్పులనుచుఁ గండలు బరికట్టి యుల నగ్గట్టి కలుకుట్లు గాలుపం బొలువడి తిరుగు భూత బేతాల బాలికాకులకోలాహలంబును మిట్టకోలల గులకులైన కిరీటంబులనుండి రాలిన వజ్ర మౌక్తిక రజోగుణంబు లవణంబు చవి మరగి ముఱుగకుండ నువ్వులకండలు పెట్టఁ జూచు పిశాచ మందగాములఁ క్రందును బదనునం బొదవిన మెదడునుం బ్రదరంబులం జదిసి కదిసిన మాంసంబును బ్రేవులంబ్రోవులు మొదలుగాఁ గూడఁబెట్టి కట్టలుగట్టి యేనుఁగు తొండంబులం దూము లమరించి చమరించిన నొమములతోడం జలువులు గట్టుకాడ నిట్టవాడిచిన రక్తంబుల నట్టనడుమ వేసనఁ జెలంగు కూశ్మాండ కుమారోద్దండ హాసవ్యసనంబును గాకఘూకజంబుక వనశునకంబులు వచ్చి వందఱలాడి యవ్వలవ్వలికి వెడలివచ్చు నేనుఁగు పీనుఁగుల డొక్కలలో నుక్కడాఁగిలిముచ్చులాడు దయ్యంపుఁదొయ్యలుల సయ్యాటంపుఁగయ్యంబును, వీరరసావేశంబున విజయాశావరవశత్వంబును జేసి మునుపడెబ్రోవుదప్పక ధరణిం బడియున్న మానవాహారహరిశాబక కళేబరంబులం జూచి సజీవశంకాతంకంబునం గొంకి వెనుకపదంబులం గ్రమ్మకొనం గమ్మిన నుమ్మనఁ గదలకుండినఁ జెంప పంపువు నేయు గోమాయు పరంపరారావంబును, విగతవీరులైన తేరులును, జర్ఝరితాంగంబులైన తురంగంబులును, శరీరహోతశరవార్షితులైన సూతులును, ఖండఖండంబులైన కోదండంబులును, రంధ్రిని కేతనంబులైన కేతనంబులును, విదళిత సూత్రంబులైన తనుత్రంబులును, రజోజాలంబులైన శూలంబులును, విదారితకూటంబులైన కిరీటంబులును, ఖండితవేణుశలాకంబులైన పుండరీకంబులును, విధ్వంసితముఖంబులైన శిలీముఖంబులును, భంగభంగంబులైన మాతంగంబులును, రుధిరసమాక్రాంతులయిన మావంతులును, యమకింకరాయత్తులయిన రాహుత్తులునుం, గల కలనిఁ గనుంగొని చని వీరాగ్రేసరుండగు నుగ్రుండు పితామహాగ్రభాగంబున నిలిచి గెలిచినవిధంబు విన్నవించిన విని విరించి పుత్రవధవిధాకర్ణన గ్రథితశోకానలదందహ్యమాన మానసుండై మండిపడుచుం జూచిన నతండునుం భస్మంబైనం బుత్రహత్యాదిదోషంబును బుత్రవిహీనత్వంబును బ్రాప్తంబయ్యెనే యని విచారించి 62

## బ్రహ్మక్షత్రహత్యాదిదోషపరిహారార్థము తపంబు సేయుట.

ఉ. ఇంతట దేవదేవుఁ గరు♦ణేక్షణు దక్షిణకాశ్యశైలశృం
గాంతరవాసు భక్తజన♦కామదభూజము నద్రికన్యకా
కాంతునిఁ గొల్వకున్న సుత♦ఘస్మరతా సుతహీనతాఘదు
ర్దాంతపయోధిపాతమునఁ ♦ దప్పిమనంబు సుఖంబునొందునే? 63

వ. అని వితర్కించుచు 64

ఉ. అంచలుగట్టినట్టి రథ ♦ మాత్మనఘాటియుఁ దాను నెక్కి చిం
తించినయంతలోఁ గనబె ♦ తీవ్రత దక్షిణకాశ్యశైలముం
గాంచె విరించి ముక్తికల♦కంఠవధూపదవీసాలముం
బంచముఖానుకూలవశ వి♦పద్వ్యపినోగ్రనవాగ్నికీలమున్. 65

తే. కాంచి కాంచనమాణిక్య♦ఖచితమైన, యంచకోదముఁ బూన్చిన ♦ యరదము డిగి
దేవియును దాను మొగలేటఁ♦దీర్థమాడి, యభవుదర్శించి జ్ఞానప్ర♦సూనాంబఁగొలిచి.

వ. దక్షిణకైలాసక్షేత్రంబునఁ గూర్చుండి కమలాసనుండు కమలాసనస్థుండై హృదయక
మలంబునఁ బరమేశ్వరు చరణకమలంబులు నిలిపి పంచేంద్రియసౌఖ్యంబులు వంచించి

సీ. కందమూలాదిభ♦క్షణములఁ గొన్నిది,నంబులు ఘోరత♦పం బొనర్చి
యంబుకణంబు లా♦హారంబుగాఁ గొన్ని, నెలలు దప్పక భక్తి ♦ నిర్వహించి
పవనాశనంబునఁ ♦ బరితృప్తుఁడై కొన్ని, ఋతువుల నద్భుత♦వ్రతము నడిపి
సతతోపవాసని♦ష్ఠాపరాయణబుద్ధిఁ, గొంతకాలము తపో♦దాంతి నెరపి

తే. భువనభవనభయంకర ♦ పవనవర్ష, శిశిర తీవ్రతర వ్యథఁ ♦ జెదరనీక
హృదయధైర్యంబుమిక్కిలి♦ పదిలపఱిచి, నలువయుబ్బంగిఁ బక్కెండ్లు♦నలి నొదపము.

సీ. గాంగేయమూఖరీ తీ♦రంగసంగతసదా, గత మహాగ్రీష్మము♦ఖము హరింప
సతతవాచంయమీ♦శ్వరకృతకేతుహాని, జ్వాలదగ్నికీలలు ♦ చలి నడంప
నికటద్రుమస్థిత♦నీలకంఠంబులు, పురుల్గొడ్డి వానల♦బిఱుసు మాన్ప
నాగంబు లాభోగ♦భోగంబు లడ్డంబు,పట్టి ఝంఝూనిల♦పంక్తి నుడుప

తే. నఖిలభూతాత్మమూర్తియై♦యతిశయిల్లు,కొమరుకుఁబడయఁగన శ్వేతుఁ♦గూర్చితపము
సేసె నటుకానఁ బవనాగ్ని♦శిఖిఫణీంద్రు, లాదిగాఁ గూడి విధికి స♦హాయు లైరి.

సీ. తల్లిగానని లేడి♦పిల్లకుఁ జన్నిచ్చి, పంచు బెబ్బులి తన♦బిడ్డయట్ల
దైవికంబున గూడు♦దప్పి నేలను బడ్డ, రాచిల్కబోదలఁ ♦ బ్రోచుఁబిల్లి
యొంటచేఁ గ్రాఁగిన ♦ కొండకోఁయులఁ దెచ్చి, యెలవావిసీడల ♦ నిలుపుఁ గ్రోతి
యెడఁబాసి పోయిన ♦ విషయోనులఁగూర్చి, కరివిరహంబు కే♦సరి హరించు

తే. స్తవితములకెగవడి వచ్చు♦ శరభములను, బట్టి యొయ్యన ధ్రాతిపైఁ♦ బెట్టికాచు
గండభేరుండపక్షులుఁ♦గలిగి యజుని, యాశ్రమము శాంతరసరూప♦మయ్యెనపుడు.

ఉ. అడ విధాతకుం జదువు లమ్మ సదా పనిపాట సేయఁ జే
తోముగఁ జెంచెత ల్పలుకు తోడుగ రాజశుకీకదంబముల్
గూడి చరింపఁగా నదియుఁ గొంత వినోదము గాఁ దపస్వినీ
క్రీడ వహించె నాత్మపతికిన్ మదిగోర్కి ఫలించు నంతకున్. 71

తే. భారతీదేవియును దానుఁ బద్మభవుఁడు, భువనములకెల్లఁ జోద్యంబు పుట్టునట్టు
లాత్మవిద్యాధురంధరుం డైనకొడుకుఁ, బడయఁగాఁ గోరి ఘోరతపం బొనర్చె. 72

మ. కరుణాధారలు నేత్రకోణములవంకం జింద నానందబం
ధురమై మానస ముబ్బఁగాఁ బ్రమథపంక్తుల్గొల్వ గోరాజునె
క్కి రటన్మంగళవాద్యముల్ సెలఁగ లక్ష్మీనాథముఖ్యామరుల్
పరివేష్టించి భజింపఁ బద్మజునకుం బ్రత్యక్షమై యీశుఁడున్. 73

ఈశ్వరుఁడు ప్రత్యక్షమై బ్రహ్మకు వరమిచ్చుట

శా. ఏ నీకేమి యొనర్తుఁ జెప్పుము సురజ్యేష్ఠా! యనన్ భక్తి భా
షానాథుండు ధరిత్రిఁ జాఁగిల నమస్కారంబు లర్పించుచున్
నానారీతుల సన్నుతించి నిటలన్యస్తాంజలిత్వంబునన్
మేనం గంపము రోమహర్షణము సమ్మిశ్రంబుగా నిట్లనున్. 75

తే. దేవ నీవంటి దేవుండు దివ్యతీర్థ, రాజములలోన దక్షిణరజతశిఖరి
వంటి క్షేత్రంబు నావంటి వాంఛితార్థ, సిద్ధుఁడు నరుదు ధర విమర్శించి చూడ.

శా. కాన న్వచ్చియుఁ జూడరాదు భవదాకారంబులో నొక్క మే
నైనం బారముముట్ట నింకెటులు లోకాతీతమై దృష్టికిన్
లోనై యుండని మీచిదాకృతి నుపశ్లోకింపఁగా నేర్చెదన్
నానాథంగుల నూరకుండుటయ ధన్యత్వంబు నాబుద్ధికిన్. 76

సీ. భారతీదేవితోఁ బాయక కాలధ,ర్మము విచారింపక మదనకేళి
దేలంగ ముప్పది వేలఱక్కసు లుదయించి వింధ్యాద్రికి నేగి వారు
ప్రజలఁ బీడింప సర్వంసహాదేవత, చెప్పిన నేను రోషించినపుడు
పుట్టె నుగ్రుండను పుత్రుండు వానిచే, నందఱఁ జంపించి యతనిఁ జంపు

తే. కొంటి నజ్ఞానమునఁ గట్టుకొంటిఁ బుత్ర, హత్య సంతానహీనుండ నైతి దేవ!
రెండుదోషంబులనుమాన్పి యిందువేద్య, నన్ను రక్షింపుమనుచుఁ బ్రసన్నుఁడగుచు.

వ. దక్షిణకైలాసగోత్ర వీక్షణమాత్రంబున నంబుత్రహత్యాది దోషంబులు వాసె మాఘ మాసంబున మఖానక్షత్రంబున నుషఃకాలంబున సువర్ణముఖరీస్నానం బాచరించి మాసంబున నీ మహాలింగంబునకుఁ బ్రదక్షిణంబులుఁ బ్రణామంబులుఁ బంచాక్షరీమంత్రజపంబును నూటయెనిమిది సేసి ప్రతిమఖానక్షత్రంబున నివ్విధంబున

నొక్కసంవత్సరంబు నడిపిన సుపుత్రుండు గలుగు నీవేళా వెవ్వరివ్రతంబు నడిపిన
నిట్లయా నని యానతిచ్చి సర్వేశ్వరుం డంతర్ధానంబు నొందె సరవిందనందనుండు
నట్లు సేయం దొడంగిన. 78

## ఋభువునిజననము.

మ. నెలలొక్కొన్ని చనంగ జరచిక్కుఁ ద్రిజగ♦న్నిర్మాతయిల్లాలికిన్
దెలఁగెం జిట్టుము, లంకురించె నగుచుల్♦ చెక్కుల్ ప్రభాతేందుమం
డలతేజంబున నొప్పెఁ, గౌను బలిసెన్♦ డాసెం గుచాగ్రంబులన్
నలు, పాదూనము దోఁచె నెన్నడ నభి♦న్నంబయ్యె నిట్టూర్పులున్. 79

తే. తెల్ల నగుమేను కుసుమిత♦వల్లిగాఁగ, గురుకుచంబులు పుష్పమం♦జరులుగాఁగ
నంటినుండెడి నలుపు నిం♦దిందిరములు, గాఁగఁ జెలువొందె వాగ్దేవి♦గర్భమహిమ.

తే. ఆత్మలోనున్న పుత్రమా♦హాత్మ్యకళంక, మాత్మజాభావతాదోష♦ మాత్మరూప
మైన పిండంబు గర్భస్థ♦మైనబైట, వెడలె ననఁ జన్ను మొనలందుఁ♦బొడమె నలుపు.

సీ. సౌఖ్యలేశములేని♦సంసారదేహాభి,మానముల్ విడిచి త్రి♦మ్మరఁగఁ గోరు
ముక్తిసామ్రాజ్యభి♦షిక్తులై విహరించు, యోగసిద్ధులలోన♦నుండఁ గోరు
మానముద్రాసక్తి♦మదికి నింపగు చోట, నేకాంతమున వసి♦యింపఁ గోరు
నప్రార్థితప్రాప్త♦మగు పదార్థంబుల, దీపనాదివ్యథ♦ దీర్పఁ గోరు

తే. విష్టపవ్యాపకంబు స♦మాశ్రయంబు, నైనబ్రహ్మంబు పిండమై♦ యాత్మగర్భ
గోళముననుండఁ దన్మహా♦గుణములెల్లఁ, దెలుపు మొలపున సంతటఁ♦బలుకు వెలఁది.

ఉ. భారతి కోరుకోర్కులకుఁ♦ బద్మభవుం డనుకూలుఁడై మఖా
తారకయందు సువ్రతముఁ♦ దప్పక సల్పఁగ నొక్కయేఁటిలో
నీరజవైరిశేఖరుని♦ నిత్యకృపం గల పుత్రజన్మముం
జేరువ యయ్యె దంపతుల♦ చిత్తమునం బ్రమదం బిగుర్పఁగన్. 83

తే. వాఙ్మయంబైన వేదాంత♦వార్ధియందు, నర్థమయుఁడైన చిద్విధుం♦ డవతరింపఁ
దన్ను మఱచిన తెఱఁగునఁ♦దమ్మిచూలి, ప్రమదమునఁ జొక్క వాణిగ♦ర్భమునుండి.

మ. ఉదయించెం బరమార్థరూపము మహా♦యోగీశ్వరోత్తంస మీ
శదయావర్ధితదివ్యతేజము సదా♦శాంతస్వరూపంబు దుః
ఖదసంసారవిదూరమానసము లో♦కం బుత్సవక్రీడలన్
బొదలంగా సుతరత్నమంత జననీ♦పుణ్యప్రభావంబునన్. 85

క. పుత్రోదయ మగుటయు శతపత్రజుఁ డానందలహరిఁ♦ బరవశుఁ డగుచున్
స్తోత్రంబుసేసె ముక్తికళత్రుని గౌరీశు నిర్మ♦లప్రతిపత్తిన్. 86

వ. ఖండపరశుండును నఖండదయామంజీతకటాక్షవీక్షణంబులఁ బ్రీత్యతుండై కమలజత
నూభవునకు ఋభువనియెడునామంబొనరింపననుగ్రహించియవగ్రహరహితంబును
గలుషాహితంబునునైన బ్రహ్మోపదేశంబు సేసి యంతర్హితుండయ్యె నంత. 87

శా. కోరెం జెంకియుఁ గన్నవారలకు సం♦క్షోభింపకే ముక్తి యా
త్మారామత్వమునం జెలంగి యిఁక నే♦యర్థంబు వర్జింపఁగా
శ్రీ రాత్మజ్ఞ లనంగ నాఋభువు ద♦ల్లిందండ్రి వీడ్కొంచుఁ బు
ణ్యారణ్యంబులఁ బుణ్యశైలముల బ్ర♦హ్మజ్ఞానియై త్రిమ్మరన్. 88

ఉ. వచ్చి నిదాఘుఁ డాఋభువు♦వంకఁ బరాపరవస్తుదర్శనం
బచ్చపడంగఁ జేసి సన♦కాదుల కంతయుఁ జెప్పి చూప నా
సచ్చరితుల్ సమస్త ముని♦చంద్రములకుం గరుణార్ద్రచిత్తులై
యిచ్చిరి బ్రహ్మవిద్య, వెల♦యించిరి వారు జగంబు నిండఁగన్. 89

శా. ఈచందమ్మునఁ దమ్మిచూలికథ గౌ♦రీశుండు చెప్పంగ ధా
త్రీచక్రేశుఁడు సాక్షి ప్రముక్తి యనియెన్♦శ్రీకాళహస్తీశ తా
ప్రాచుర్యంబు పురాణసిద్ధముగ నె♦ప్పాటన్ జగన్నాయకుం
డాచంద్రార్కముగా ధరించె నిది నా♦కాద్యంతముం జెప్పవే. 90

క. అనవుడుఁ గుహనాజంగమ,తనువు ధరించిన సుధాంశు♦ధరుఁ డిట్లనియెన్
మనుజేశ్వరుతోఁ గరుణా,వననిధియై విను మటంచు ♦ వాచాప్రౌఢిన్. 91

క. తొలియుగమున శ్రీనామముఁ, గలచెలఁదియుఁ ద్రేతయందుఁ♦గాళంబనుపా
ములతోడును దానికి నీ,తలియుగమున హస్తియుఁ వ్ర♦తంబునఁ గొల్వన్. 92

శా. గౌరీశుండు చెలందిఁ బాము గజముం♦గైవల్యసామ్రాజ్యల
క్ష్మీరూపంబగు తన్నుఁ గూర్చుకొనఁగా♦శ్రీకాళహస్తీశ్వరుం
డై రాజిల్లెఁ దదీయభక్తిగరిమం♦బాద్యంతము న్నీకు వి
స్తారప్రౌఢి వచింతు రాజ! వినుమా♦దత్తావధానుండవై. 93

—— చెలఁదిపురుగు శివైక్యముఁ బొందుట. ——

చ. కృతయుగవేళ మర్కటక♦కీటక మొక్కటి పూర్వవాసనా
గతమతి దేవదేవు గర♦కంధరుఁ గొల్వఁ దలంచి కుంభజ
క్షితిధర కన్యకాంబు పరి♦షిక్త శరీరముతోడ నాత్మని
ర్గత బహుతంతుపంక్తి గృహ♦కల్పన శిల్పకళాప్రవీణతన్. 94

సీ. ప్రాకారములు గోపు♦రమ్ములు కొలువుకూ,టములు నర్తనమంది♦రములు కోశ
గేహము ల్పందిళ్ళు ♦ కేళీనివాసంబు,లంతఃప్రదక్షిణా♦యతనవీథి
యుపహారభోగమం♦టపము గర్భగృహంబు,పరిణయహోమవై♦భవనిశాంత
మంతఃపురంబు క♦ల్యాంతరంబులు జాల,కంబులు మేడలుఁ♦గరుణతోడ

తే. నిభముఖానలజాతచం♦డీశ్వరుండు, ధీకలోచన మాతృకా♦లోకనయన
దక్షిణామూర్తి వటుకాది♦దైవతముల, నిలయములు గిట్టె నత్యంత♦నిష్ఠతోడ. 95

శా. ప్రాతఃకాలతుషారశీకరచయ♦ప్రాప్తిం గలనస్తోకకో
పేతాగారములెల్లఁ జెల్వెసఁగుత♦ద్బిందుచ్ఛటాజాలఖ
ద్యోతచ్ఛాయలఁ గాంతిసేయు బహుర♦త్నోద్దీప్తగేహంబులై
లూతాకల్పితతంతుసద్మములు వా♦ల్పుం జెప్పఁ జిత్రంబులై. 96

కం. తీరుగ నీగతి నిండులు, తీరఁగఁ గట్టియును గాలిఁ♦ ద్రెవ్వినపోఁగుల్
జాఱిన పోఁగులు నమకిం, దీరుపనే కాని నిలువఁ♦ దీరక దినమున్. 97

శా. సేవింపంగఁ జెలందినేఁడుముఁ బరీ♦క్షింప న్విలాసాత్ముఁ డా
త్మావాసంబు నమున్న దేవశిఖికీ♦లాభీలతీవ్రప్రభా
వ్యావిద్ధాంబరమై తగుల్కొని తదీ♦యాగారముల్ ధూమమై
పోనం జేసిన లేచి కీటకము హృ♦ద్వ్యాపవ్యథాక్రోధమై. 98

కం. ఇది యెక్కడిదుములు వచ్చెఁ, సదనంబులు గట్ట నాకు♦ శంభునికొఱకున్
దుడిఁ గుమ్మరి కొఱకయోఁడును, గుడె కొనిపెట్టన్న మాట♦కుఱ్ఱ నరివచ్చెన్. 99

ఉ. కిటకిట నేఁ బ్రయాసమునఁ♦ గట్టిన యిండ్లను గాల్చె దీప మిం
తటఁ బడి గీని త్రింగి నృ♦థా నసియించినఁ గోపమాఱునే
యటమటమైన జీవనము♦నందలి మోహము చాలునంచు ను
త్కటగతి దీపికానలశి♦ఖావిసరంబులఁ ద్రావఁ బోవఁగన్. 100

శా. దేవోత్తంసుఁడు భక్తవత్సలుఁడు చి♦త్తేశస్వభావుండు గౌ
రీవామాంగుఁడు శంకరుండు దయ మూ♦రింబోవఁ గెంగేలనా
జావ న్వచ్చిన పుర్వుఁ బట్టి తగునీ♦ సద్భక్తికిన్ మెచ్చితిన్
నీ వేయర్థము నన్ను వేఁడెదవు దా♦నిం జెప్పుమా నావుడున్. 101

కం. వలఁదియు నాతప మింతట, ఫలియించె ఫటంచుఁ బ్రమథ♦పతికిఁ బ్రణామం
బులు పెక్కు సేసి సంభ్రమ, కలితహృదయమగుచు భక్తి♦గడలుకొనఁగన్. 102

శా. దేవా! నిన్ను నుతింపలే, నధముఁబు♦ద్ధిన్, వేదశాస్త్రంబులుం
రా వేసాటియు, వచ్చినన్ శ్రుతులు శా♦స్త్రంబు ల్మిముం జెప్పఁగా
లే వాద్యంతము లన్నఁ దద్విధులకుం♦ దెక్కింపఁగా శక్యమే
సేవాధర్మము మేలు గాకనుచు మీ♦శ్రీపాదము ల్గొల్చితిన్. 103

కం. నా కీభవదుఃఖంబులు, లేక మహాజ్ఞానరసని♦లీనుఁడ నగుచున్
లోకం బెన్నఁడు నెఱుఁగని, యాకైవల్యమె యభీష్ట♦మని ప్రార్థింపన్. 104

చ. అనిమిషకోటి తా మహార♦హంబు నొనర్చు శివార్చన ల్ఘనం
బున నిరసింప, మానులు త♦పోవిధవంబులు రోయ, యోగవా

వనంబడి పొర్లువాడు తమ♦జిహ్వమును గెట్టుకొనంగ, నన్యద
ర్శనరతు లెల్ల మానమయు♦నంగతి చాలునటంచు, నెంచఁగన్. 105

ఉ. ఎక్కడఁ జూచినన్ సురము♦నీశ్వరదానవమానవాహిపుల్
మ్రొక్కుచు సన్నుతించు రవ♦ముల్ భువనాండలవీథి నిండఁగా
దిక్కులు ముంచుకొన్న తన♦తేజములోపల నూర్ధ్వనాథమున్
గ్రక్కునఁ గాంచెఁ దన్మయము♦గా శివలింగము భక్తిలోలతన్. 106

క. లూతాధీశ్వరు కథ యిది, వాతాశన హస్తికథలు♦ వ్రాయుదు మహా
పాతకధాత్రీధరని, ర్ఘాతములై యమృత మొలుకఁ♦గా వీనులకున్. 107

కాలసర్పము నేనుఁగును శివసాయుజ్యము నొందుట.

శా. త్రేతాంతంబున నొక్కకాలఫణి భ♦క్తిన్ దివ్యమాణిక్యముల్
పాతాళంబున నుండి తెచ్చి దినముం♦బాలేందుచూడార్చనల్
ప్రాతర్వేళలఁ జేయు ద్వాపరయుగ♦ప్రారంభమైన న్గజా
తీతుం డంకురుఁ గొల్వ వచ్చె నొకహా♦స్తిశ్రేష్ఠ మత్యుత్కటన్. 108

సీ. వచ్చి కైశకనది♦ వారిలోపల దోఁగి, కాలు గొలుకులు♦ కలయఁ దిరిగి
మాలూరశాఖలు♦ నాళీకకహ్లార, కుముదపుష్పంబులు♦ గోసి తెచ్చి
ఫణి సమర్పించిన♦ మణులెల్లఁ బోఁద్రోచి, తొండాన గ్రోలిన♦తోయములను
దక్షిణాకైలాస♦ ధరణీధరావాసు, సద్భక్తితోడ మ♦జ్జనము సేసి

తే. పూజలొనరించి యేనుఁగు♦ పోవుటయును, భవుని దర్శింప మఱునాఁడు♦పాప తేఁడు
నిజఫణాగ్రసమగ్రమా♦ణిక్యదీప్తి, తనునుచుఁ దోఁచు నుమకాల♦తమముఁ జెఱుప. 109

ఉ. డగ్గఱి యెవ్వఁడో కటక♦టా శివలింగముమీఁది రత్నముల్
గగ్గులకాటఁ గప్పి ములు♦కంపలు తీవలు నెట్టి నేఁడు, నా
కిగ్గొనరించి పోయె, నిఁక♦ నేమననేర్తు మదీయ భాగ్య మి
ట్లగ్గిఁబడంగఁ జేసినమ♦దాంధుని నంచు విషాదచిత్తుఁడై 110

క. అల్లన యేనుఁగు వెట్టిన, వెల్లం బోఁద్రోచి యెడఁద♦నీసును భక్తిన్
మల్లాడ మణుల గూరీ, వల్లభుఁ బూజించి చనియె♦ వాతాశనమున్. 111

ఉ. అంతటఁ గొంత సేపునకు♦ నగ్గజరాజును వచ్చి దర్శనం
బ్రాంతశరీరు నీశ్వరునిఁ♦ గన్గొని యెవ్వఁడొ నేఁడువచ్చి తా
నంతమనంబు గప్పియొక♦నక్కఱుఁబూజ లొనర్చెఁ గాక యే
భ్రాంతులు పెక్కువర్ణముల♦ రాలు కపర్దికిఁ బెట్టఁ జూతురే. 112

క. అని చింతించుచు నెప్పటి, యనువున శివపూజఁ జేసి♦ యడవికిఁ జనియెన్
దనయిచ్చ దంతి పామున్, బనివడి మఱునాఁడు దాఁ బ్ర♦భాతమునందున్. 113

మనమున శిలాశకలమండన మెట్లు ప్రియంబుఁ జేసె? నే
మనఁగలవాఁడ నిన్ను వ్రతహానియొనర్చు దురాత్ముఁ డుండఁగన్. 121

శా. పోనీ నేఁటికి నాయెఁ బోయెఁ గడుదుర్బుద్ధిన్ విచారింప నే
లా నిత్యంబును నీశ్వరుం గొలుచు వేళం గాక కేపాడి రాఁ
గా సర్వవ్రతహంతఁ గన్న నధిభాగ్యంబే వివేకింప వాఁ
డా నేనా నొకజాడఁ బోయెదము లేదా జీవ మింకేటికిన్. 122

ఉ. ప్రాణము లిచ్చువాఁడ నిఁక భర్గున కెల్లియుఁ బూజపోయి పా
షాణము లున్న నిందునకు నందియు మేల విచార మేటికిన్
ప్రాణము మీఁదఁ దీఁపుగల ప్రాణులకున్ విరుదున్ వ్రతంబు క
ల్యాణకరంబులే యనుచు నర్చన సేసి మదేభరాజమున్. 123

సీ. పిపీయేతుఁగుల వెంటఁ బడిపోక యుఁడుగని, వెడవిల్తు వేఁడిమి విడువఁ జూవఁ
గరమున నుదకంబు గడుఁ జల్లుకొనకున్నఁ, దెమలని మిహిరదాహము దొలంగ
నరసునఁ జొచ్చి తామరతూండ్లు మెసఁగక, మానని యూఁకటి మంట లేక
సింహపోతములు ఘోషింపఁ బుట్టినభయాతంకాగ్ని తహతహఁ గ్రుంకఁ బాఱి

తే. కట్టిపెట్టలుఁ దనమీఁద నెక్కలేక, పంచబంగాళమై పోవఁ బ్రాణలింగ
పూజనావిఘ్నమున యందుఁ బుట్టినట్టి, చింతయను వేఁకి దనలోను చేసికొనియె.

తే. ఏమిసేయుదు ననియాత్మ నీసుమునకుఁ, బోయి తనలోనఁ దలపోఁత బుగ్గిగుడయ్యె
నెవుడు పడమటికొండపై నెక్కు భానుఁ, డెప్పు డుదయించు నేఁ బోదు నెప్పుడనుచు. 125

వ. అయ్యవసరంబున.

సీ. ప్రాగ్వధూమణి చిమ్మఁ బశ్చిమదిక్కాంత, పట్టిన చెంగల్వబంతి యనఁగఁ
గాలవిష్ణుండు ధకారదైత్యుని వ్రేయఁ, జరమాద్రిఁ బడిపోవు చక్ర మనఁగ
దినమహీరుహమునఁ దేజోమయంబుగాఁ, బండిరాలిన పెద్దపం డనంగ
దివినుండి దేవదానవయుద్ధరక్తార్ద్రమై నేలఁ గూలు రథాంగ మనఁగఁ

తే. బద్మినీసంగమశ్రాంతిఁ బరిహరింప, నపరజలనిధి జలకంబు లాడఁ బోవు
కరణి నెఱసంజచందురుఁ గావిపచ్చడంబు ధరఁ బెట్టి భానుబింబంబు గ్రుంకె. 127

శా. తారాలోకమునం బ్రకాశ మొకచందం బై ప్రసాదింప సం
ధ్యారాగావృతమై తమఃపటల సంతానంబు గప్పంగ సం
భోగేచ్ఛల్ గళదశ్రుధారలగతిం బొల్పారఁగాఁ బోయెఁ గ
ప్లోరవారితము నవ్వలోకనయనం బంధీకృతప్రాణియై. 128

చ. తిమిరపుఁగాలసర్పవితతిన్ గుహ లీఁగి చనంగఁ దోలి య
ఖ్రిము వడి నెక్కి చూచి దిగి వన్నగలోకముఁ జొచ్చి పోవున

ట్లమరం బతంగ దేవుఁ డప♦రాంబుధిఁ గ్రుంకెఁ దదీయసేన తు
త్తుమురుగఁ బోరియు న్నసుర♦ దోడనె ధాత్రినిఁ గూడముట్టఁగన్. 129

మ. విపులావాలమునిండి శైలగుహాల♦ వేళ్ళాతి శాఖల్ దిగం
తపదమ్ముల్ పాదువ న్వియత్తలము మీ♦ఱన్ మించి యొప్పారు ద
ట్టపుఁ జెంజీఁకటి చెట్టుఁ జుట్టుకొనియుం♦డం బొల్చెఁ దార [illegible]
యఫలాశాంతరదర్శితోర్ధ్వభవనో♦ద్యద్దీప్తిఖండక్రియన్. 130

మ. సకలాపూర్ణుఁడు నీలవర్ణుఁ డనుటల్ ♦ సత్యంబుగాఁ దెల్పుపో
ల్కిఁ జెంజీఁకటి నిండఁ దారకలు వా♦ల్చెన్ నిర్జరాధీశ్వరా
దిక లర్పించిన పుష్పాల ట్లధవుఁ డ♦ద్దేవుండు భేదంబుగా
మికిఁ దెల్లంబుగ నల్పు దెల్పుగ ధరన్ ♦ మించెన్ శశాంకాకృతిన్. 131

మ. ఉదయగ్రావము సానపట్ట మభిషే♦కోదప్రవాహంబు వా
ర్ధి. ధరధ్వాంతము ధూపధూమము, జ్వల♦ద్దీపప్రభా రాజి కౌ
ముది, తారానివహంబు లర్చితసుమం♦బుల్ గాఁ, దమోదూరసా
ఖ్యదమై శీతగభస్తిబింబశివలిం♦గం బొప్పెఁ బ్రాచీదిశన్. 132

మ. గగనాహార్యమృగేంద్రశాబకము న♦క్షత్రాంబుజారణ్య మ
ధ్యగహంసంబు నిశావధూకరతలో♦ద్యన్మల్లికాగుచ్ఛ మ
ధ్వగబాధావహచిత్తభూకటకయా♦త్రామాత్రికచ్ఛత్ర మొ
ప్పుగతిం జంద్రుఁడు దోఁచె దంపతుల కిం♦పుల్ మీఱఁగాఁ దొల్దెసన్. 133

మ. గరుడానీతసుధాఘటంబు గొని పోఁ♦గా నిర్జరశ్రేణి వెం
ట రయం బాఱఁగఁ బాఱు నాగముల చూ♦డారత్నసందోహ మం
బరవీథిం బరఁగింపఁ జంద్రుఁ డుదయిం♦పం, దోఁచెఁ దోడ్తో నుడూ
త్కరముం జిందమృతంబుబిందువులశం♦కం గ్రమ్మఁగం జేయుచున్. 134

చ. కుముదవనాళికిన్ బలుపు ♦ కోకములాటకు నిల్పు, దిగ్వధూ
సమితికిఁ బూఁత, మేత నవ♦శాబచకోరకరాజి, కిందుకాం
తములకు ద్రావకం, బగుచు♦ దర్పకశాస్త్రనిరూపితౌషధ
క్రమములఁ బండువెన్నెలలు ♦ గాసె ధరాస్థలి మోహనంబుగన్. 135

ఉ. అప్పుడు పాము నేనుఁగు మ♦హావ్రతవిఘ్న విషాద వేదన
మ్ముపిర్పిగొన్న చింతఁ గను♦మూయు నెఱుంగక నెమ్మనంబులో
నెప్పుడు తెల్లవాఱును స♦హింపఁగరాని విరోధవహ్ని నే
చొప్పున నార్తుమొక్కొ యను♦చుం దమలోఁ దలపోయుచుండఁగన్. 136

సీ. నిర్నిద్ర పూర్వాద్రి♦నీపప్రసూనాభి, రామాంబురాశి త♦రంగ మనఁగ
ఘానుభిల్లగభస్తి♦భల్లభగ్నతమోచ్ఛ, భల్లనిర్యద్రక్త♦పంక మనఁగ

రజనీసుధాకర♦రతివియోగనిధాన, కామప్రతాపాగ్ని♦ధామ మనఁగ
సంధ్యాధిదేవతా♦చారుపీతప్రావృత, పద్మరాగప్రభా♦పటల మనఁగ
తే. గాలరసవాది బ్రహ్మాండ♦గోళమెల్లఁ, జిత్రబుద్ధి సువర్ణంబు♦సేయఁ దలఁచి
ద్యుమణిశిఖమీఁదఁ జల్లుసిం♦దూరరాజి, యనఁగ నొప్పారె నరుణశో♦ణాంశురాజి.

ఆ. పన్నగంబు గజము♦ బలమునఁ జలమునఁ, బోరుటెట్లొ శివుని♦ బొందుటెట్లొ
చూడవలయు ననుచు♦ వేడుకతో వచ్చు, కరణి వంతఁ దోఁచెఁ♦గర్మసాక్షి. 138

వ. అంత. 139

ఉ. భానుఁడు పూర్వపర్వతము♦పై నుదయింపక మున్నె లేచి కుం
భీనసవల్లభుండు మఱిఁ♦ బేర్చిన రోషభరంబున న్నిజ
స్థానము నిర్గమించి పగఁ♦ బంపఁగ వచ్చు కటారుకాని చం
దాన మహేశ్వరుం గదిసి♦ తా నొనరించిన పూజ లేమికిన్. 140

క. కటకటఁబడి యిఁక నెటువలె, నటుకానీ వానిఁ దీర్తు♦ నటు కాదేనిన్
నిటలాక్షున కర్పింతుం, జటులగతిం బ్రాణములు ని♦జంబుగ ననుచున్. 141

ఆ. పిన్నగూప మనుచు♦ బిల్వశాఖాంబుజ, నాళమధ్యసీమఁ♦ గాళనాగ
మడఁగియుండ దంతి♦యతివేగమున వచ్చి, శివునిపూజఁ జూచి♦ చిత్త మలర. 142

ఉ. ఈసకలేశ్వరుండు కరు♦ణేక్షణుఁ డయ్యెనో విఘ్నకర్త సం
త్రాసము నొందెనో వ్రతము♦ ధన్యతఁ బొందెనో పూర్వజన్మ వే
శ్యాసుకృతంబు పండెనొ క♦ళానిధిశేఖరమౌళి నేఁడు నేఁ
జేసినపూజ నిల్చె నని♦ శీఘ్రమున న్ముదమంది క్రమ్మఱన్. 143

ఆ. డాఁగియున్నపాము♦ డాయకపోయెఁగా, దాయ యనుచు రోష♦దహనశిఖలు
కన్నుఁగొనలఁ గ్రాలఁ♦గా నుండ నాకీడు, గాన కిభవరుండు♦ గాన కేఁగి.

వ. నీరేరుహ మాలూర దళభరంబులు కరంబునఁ జుట్టి పట్టుకొని సమీరంబున జడియు నడలచప్పుడు దప్పి డిసుమడింపఁ గంపించి గుంపు విచ్చిమృగంబులు మొగంబు లెత్తుకొని పాఱం గారుణ్యరసతరంగం బగు శివలింగంబుఁ జేరం జనుదెంచి డించి పాపహృదయశల్యం బగు నిర్మాల్యంబుఁ దునుమం దలంచి 145

శా. శుండాలంబు కరంబు సాఁప ఫణిరా♦జు న్మెచ్చి నాపూజ భ
గ్నం జేసెన నన్ద్రోహించె నని ము♦ఖ్యోగ్రోల్కలో నెక్కి యు
ద్దండక్రీడఁ దదీయకుంభకుహర♦స్థానంబునం ద్రిమ్మరన్
గొండ ల్గాలఁగ నెత్తి మొత్తుకొని ది♦క్కుల్మ్రొట్ట గీఁపెట్టుచున్. 146

సీ. మొగలేటి మడుఁగున♦మునిఁగి తుండమ్మున, నుదక మాకర్షించి♦ యూఁది యూఁది
కడుఁగపాలము దాఁకి♦ కలఁగంగఁ జక్కఁగాఁ, జేసాఁచి జిఱ్ఱునఁ♦ జీఁదిచీఁది

యిలమీఁదఁ దలదాఁక • నీవ్రక్క నావ్రక్కఁ, బెడమర్లుగాఁ బాడ • పెట్టిపెట్టి
యుసిపోని వేదన • నున్నచో నుండక, పనిలేనిపరువులు • పాఱిపాఱి
తే. పెద్దఱాఁతులతోఁ గుంభ • పీఠయుగము, దోముకొనుచును జెట్లులు • దూఱిదూఱి
పాము సేసిన దుఃఖంబు • సామజంబు, దీర్చుకొనువెర వెఱుఁగక • ధీరబుద్ధి.

శా. ఏనా చచ్చుట తప్పదిప్పుడు సుమా • ధీశోవకంఠంబునన్
దానుం జావక చంపనోవ దురగేం • ద్రం బెక్కుడీదుఃఖమే
లా నాకున్ సరి వంపి చచ్చుట జనా • హ్లాదంబు గాదా యువా
చీనస్థానునగంబె వధ్యశిలగా • సేవింతుఁ గా కింతటన్. 148

మ. అని మత్తేభము చిత్త[illegible]హితుని ది • క్కై మ్రొక్కి యిక్కాళమే
కనుచుం బోవునో యంచుఁ దుండ మిఱియం • గాఁ జుట్టి వక్త్రస్థలం
బునఁ గీలించి పిఱిందికిం జని శిరం • బు స్వాంచి యక్రొంచి భ
గ్గునఁ దాఁకె న్వడిఁ గుంభముల్వగులఁ దం • తూత్కాటంబు లూటాడఁగన్. 149

ఆ. కొండకొండలోడ • గుంపులుగూలంగ, దాఁకినట్లు దోఁచె • దళితకుంభ
సీమనున్నపాము • చిదిసె నేనుంగును, బడిసె నెత్తురచటఁ • బడియె గట్టి 150

వ. తదీయ మరణస్థానంబు ప్రాచీనకైలాసనికటంబును సువర్ణముఖరీతటంబు నగుటం జేసి కాద్రవేయ భద్రగజంబులు రుద్రగణాకారంబులు దాల్చిరి. అమ్మహాలింగమధ్యంబునం దుంసికొండల ఱేనికూరిమికూఁతుతోడం గూడి చంద్రచూడామణి వృషభవాహనారూఢుండై హృషీకేశ పితామహ ప్రముఖ బర్హిర్ముఖులు గొల్వం బ్రత్యక్షుండై మీకభీష్టంబు లెయ్యవి యని యానతిచ్చుటయు సాష్టాంగదండప్రణామంబులు గావించి యిట్లని సన్నుతించిరి.

రగడ జయజయ కలశీసుతగిరికన్యా, శైవలినీతట కల్పమహీరుహ
జయజయ దక్షిణ రజత క్షితిధర, సంయమి సేవిత పాదసరోరుహ
జయజయ పీన జ్ఞానప్రసనా, చలకన్యాకుచ దృఢ పరిరంభణ
జయజయ కృత మద్గాధరణీధర, సాను వినోద విహార విజృంభణ
జయజయ భారద్వాజాశ్రమ వన, సరసిజ కేళీ వన పరితోషిత
జయజయ నీలక్ష్మాధర పుణ్యా, స్థలకాపాలిక భాషితభూషిత
జయజయ మోహాన తీర్థాలోకన, సంభ్రమరత భవబంధ విమోచన
జయజయ శిఖతీర్థాశ్రిత యోగీ, శ్వరమానస సంవిత్సుఖ సూచక
జయజయ సహస్రలింగాలయ ద, ర్శనమాత్రస్థిత మోదాపాదక
జయజయ ఘన మార్కండేయమునీ, శ్వరతీర్థనిషిక్తవిపచ్ఛేదక
జయజయ నిర్ఝరనాయక తీర్థ, స్నాతక జనకలుషేంధన పావక
జయజయ కనకేశు దక్షిణనిజ, చరణారుణ పంకేరుహ సేవక

దేవా నిను వర్ణింప రమావా,గ్దేవీ వల్లభు లైనను శక్తులె?
నీవిధ మెఱుఁగరె నిఖిలాగమములు, నేర్పరు లైనను జీవన్ముక్తులె?
కొందఱు సోహమ్మని యద్వైతా, కుంఠితబుద్ధి న్నిను భావింతురు
కొందఱు దాసోహమ్మనిభక్తిని, గుణవంతునిఁ గా నిను సేవింతురు
కొందఱు మంత్రరహస్యమ వని నినుఁ, గోరి సదా జపనియతి నుతింతురు
కొందఱు హఠయోగార్థాకృతివని, కుండలిచే మారుతము ధరింతురు
తుది నందఱుఁ దమయిచ్చల నేయే, త్రోవలఁ బోయిన చిద్రూపమ్మును
గదియక గతిలేకుండుట నిజముగఁ, గని చాలింతురు మది సంతాపము
నిను సేవించిన కృతకృత్యుఁడు మఱి, నేరఁడు తక్కిన నీచులఁ గొల్వఁగ
నిను శరణం బని నిలిచిన ధీరుఁడు, నేరఁడు తక్కిన చోటుల నిల్వఁగ
నీ వనిమెమునిధిఁ గాంచిన ధన్యుఁడు, నేరఁడు తక్కినయర్థము గోరఁగ
నీవే గతియని యుండెడు పుణ్యుఁడు, నేరఁడు తక్కిన వారలఁ జేరఁగఁ
భవదుర్వాసన పాయదు మీపద, పంకజముల హృదయము వాసింపక
చవులకుఁ గలఁగవు సకలేంద్రియములు, సతతమ్మును మిమ్ము నుపాసింపక
జనన మరణములు ధరలో మిమ్మును, సమ్మతితో సేవింపక పాయవు
మనమునకును మీ చిన్మయరూపము, మరగింపక యణిమాదులు డాయవు
మీమహాత్మ్యము మేమింతంతని, మితిచేయఁగ మది నెంతటివారము
మామీఁదను గృప గల్గి మహేశ్వర, మన్నింపుము మీకు నమస్కారము. 152

శా. ఈసంసారపయోధిలోనఁ బడి మే◆మీఁదీది దేహంబుపై
నాస ల్మానక తేలుచు న్మునుఁగుచుం◆బ్రాణప్రయాణోన్ముఖా
యాసంబుల్ శతసంఖ్య లోర్చితిమి దే◆వా మమ్ము రక్షించి మి
థ్యాసౌఖ్యంబులు చాలు నిత్యసుఖ మి◆మ్మా యంచుఁ బ్రార్థించినన్. 153

శా. డాయం బిల్చుచు వారి నిద్దఱ నఖం◆డజ్ఞానరూపంబునన్
వ్యాయామంబు నదృశ్యవస్తువు నమా◆యాకారముం బుష్కర
ప్రాయంబున్ విమలంబునైన తన◆సర్వవ్యాపకజ్యోతిలో
సాయుజ్యం బొనగూర్చె దేవతల కా◆శ్చర్యంబు సంధిల్లఁగన్. 154

క. ఆలిం గూడుచుఁ గ్రమ్మఱ, నాలింగమునందుఁ గలసె ◆ సదిమొదలుగఁ జం
ద్రాలంకారుఁడు జగతీ, పాలక శ్రీకాళహస్తి◆పతి యనఁ బరఁగెన్. 155

క. నావుడు విని యాదవ ధర,ణీవిభుఁ డీశ నెవ్వ రందు ◆ నీలగ్రీవున్
సేవించి ముక్తికాంతా,జీవేశ్వరు లైరటన్న ◆ శివుఁ డిట్లనియెన్. 156

శా. కామక్రోధ మదాంధకార పటలా◆ఖండప్రచండార్క వే
ధో ముముక్షుయ తాండవభ్రమణని◆ర్ధూతప్రపంచా పుర

శ్రీ మాహాత్మ్యహార ప్రభావ దళదిం క్స్వేలప్రభేద స్ఫుర
ద్దామా కాలజయేందిరా మదవతీంధాంపత్య నిత్యోదయా 157

క. లుంటీకృతాఘుముక్తిచి,రంటీ గాఢోపగూఢంరత చిద్విద్యా
ఘంటాపథచర తారక,ఘంటారవ హృతమనోమృంగవ్యాఘ్రేశా. 158

పంచచామరము. దివానిశోదయావసాన ం దిగ్విహీనఖండితా
జవంజవాంధకారసత్యం నంవిదభ్రిమండితా
దివాకరాదిక గ్రహౌఘాగ్రందీధితి ప్రసాద వా
గ్బ్రహ్మాండభాసకాదితత్త్వం తారకప్రసాధవా. 159

గద్యము. ఇది శ్రీమత్కాళహస్తీశ చరణకమల సేవాపరాయణ సింగమనామా
నారాయణ జక్కయనారాయణ తనూభవ భవపరాఙ్ముఖ
ధూర్జటిప్రణీతం బైనశ్రీ కాళహస్తిమాహా
త్మ్యంబునందు ద్వితీయాశ్వాసము.

శ్రీ రామార్పణమస్తు.

---

శ్రీ రా మా య న మః.

# శ్రీకాళహస్తిమాహాత్మ్యము.

## తృతీయాశ్వాసము.


ధరనయనాబ్జసమా
రాధితదివ్యాంఘ్రిశోణ•రాజీవ! మనో
బాధానవహసంసార
వ్యాధివ్రజవైద్య! కాళ•హస్తీశ! శివా!

ఆ. అవధరింపు మిట్లు•భవదీయకథ విన్న, వింతు భక్తజనుల•వీను లలర
మీకు యాదవునకు• గారుణ్యరసపూరి, తేక్షణముల నాన•తిచ్చినట్లు. 2

—కన్నప్పయను తిన్ననిజన్మభూమివర్ణనము.—

ఉ. పొత్తపినాటిలో విపిన•భూమిఁ గిరాతుల కోటపట్టు లో
కోత్తరవన్యవస్తు వుడు•మూరను పక్కణ మొప్పుఁ, దద్ర మో
దాత్త మహాత్త్వ మన్మథతర•సావహ మూహ యొనర్ప మేదిసీ
భృత్తట నిర్ఝరాంబురుహ•బృంద సుగంధ సగంధవాహమై. 3

సీ. స్తబ్ధరోమవిషాణ•లబ్ధమహాస్థికముల, గాటింపుదురు రేగు•పండ్లపాటి
ముక్తకంచుకమస్త•ముక్తాఫలంబుల, మండలింతురు కారు•విందలట్లు
సమద సామజకుంభ•జముల్లైనముత్తియంబులఁ జూతు రుసిరికా•యల విధమున
వేణుజాతముల్లైన• యూణిపూసల నెంతు, గురువిందపండ్ల ను • నీసుగాఁగ
తే. గంధసారాసురుద్రుము • కాష్ఠఖండ, చయము దినయింటి వంటక•ట్టియలుగాఁగఁ
జేయుదురు కాఁపురంబులు• సేయునపుడు, చెంచెతలు చెంచులను గూడి•చిత్రలీల. 4

ఉ. సంకుమదంబునుం బునుఁగుఁ • జాఁదును గస్తురియుం ఘటంబులం
బంకముఁజేసి యిండ్లలికి • ప్రత్యహము న్వెలివైవ మార్గకూ
లంకష గోమయప్రలేతు•లం బుడిడించుచుఁ నుందు గుప్పలై
యింకఁ దదీయభూతి నిద•మిత్థ మటంచు నుతింప శక్యమే? 5

సీ. పట్టుచీరలఁ గట్ట • భాగ్యంబు గల్గియుఁ, బొలుటాకులఁ గట్ట • భార మనరు
రాజాన్నభోజన•ప్రాభవశ్రీ గల్గియును వన్యధాన్యంబు • నొల్ల మనరు
మాణిక్యభూషాస•మాజంబు గల్గియు, నెత్తని కురువింద • లేటి కనరు
మంచిమెచ్చులతూఁగు•మంచము ల్గల్గియుఁ, జాలుఁ బూఁదీగయు•య్యాల లనరు

హా మయూరీ హరిణేభ శాబముల నా♦హా! యెంతు రాశంకఁ ద
ద్రమణీ మధ్యకచేక్షణస్తనము లు♦త్పాదింపఁ గాకుండునే. 16

వ. ఇట్లఖిల విభవాభిరామంబున కాలవాలంబగు నప్పట్టణంబున కధీశ్వరుండు 17

సీ. తన విక్రమక్రమ♦దర్పంబు హర్యక్ష,శిక్షావిచక్షణా♦క్షీణగరిమ
తన బాహుబలము కాం♦తారదంతావళి,దయితా నవీన వై♦ధవ్యకరము
తన జనంబు కురంగ♦దంపతీపుంజాజ,వంజవ భంజనా♦ఖంజయశము
తన ప్రతాపము మృగా♦దనసార్వభౌమదు,ర్వార గర్వాపహా♦దారుణంబు

తే. గాఁగ నానా మృగఘ్రాణ♦గంధవాహ, దండశూకేంద్ర నారాచ♦బృందవర్ష
కంధరోద్దండకోదండ♦కరుఁడు మించె, నాథనాథుం డరణ్యభూ♦నాథుఁ డగుచు.

తే. ఎఱుకుఱేఁడైన సర్వలో♦కేశుఁ గూడి, చెంచుపూఁబోఁడియై సంచ♦రించుగౌరి
చందమున నాథనాథపు♦లిందవిభుని, మందగామిని చెలువొందెఁ ♦ దండె యనఁగ

## తిన్ననిజననము.

క. అనాథనాథకానన,భూనాథుఁడు తండెచిగురుఁ♦బోఁడియు సురతే
చ్ఛానందము గిరికంధర,సానువనీనిర్ఝరముల ♦ సలుపఁగఁ బ్రీతిన్. 20

క. తండెకు మందస్మితసిత,సుందరకుఁ బ్రాణేశ్వరోప♦గూహనరచితా
నందకు వచనామృతని,ష్యందకు నెల మసలె శైల♦జాధిపుకరుణన్. 21

సీ. భసితాంగరాగశో♦భావిలాసంబుతోఁ, బ్రతివచ్చు నానన♦పాండుగరిమ
కంఠహాలాహల♦కాళిమచ్ఛవితోడ, నెనవచ్చు గుబ్బచ♦న్మొనలనలుపు
పరశివాకృతితోడ ♦ సరివచ్చు నణుతరం,బనఁజాలి ఘనతరం ♦ బైననడుము
స్వస్వరూపవిచార♦సంప్రాప్తశాంతితో,మార్పడుఁ జిత్తైక♦మానజడిమ

తే. సరభసానంగసంక్రీడ ♦ జరుగనీక, దౌహృదము గర్భముననున్న♦తనయుఁ డీశుఁ
డై ప్రకాశింపఁ గలఁ డని♦యపుసు తెలుపు,కరణిఁ బెంపొందె నమ్మంద♦గామినికిని.

తే. గంధగజకుంభ కాఠిన్య♦గర్వరేఖ, చారుమృగరాజ మధ్య♦శృంగారగరిమ
చెఱుపఁగలఁ డల్లశిశు వని♦చెప్పునట్లు, సుదతిచన్నులు నడుమును ♦ సొబగు దప్పె.

సీ. పంచాననానేక♦పవ్యాఘ్ర కోలాది,మృగములఁ జంపఁ గా♦మించె లేమ
శైలోపకంఠని♦ర్ఝరసైకతస్థలి,శివుని దర్శింపఁ గాం♦క్షించె నబల
ఖండేందుశేఖరు ♦ గండూషితాంబుధా,రల మజ్జనము సేయఁ ♦ దలఁచె నింతి
చవియైన ఘోణిమాం♦సమ్ము దొప్పలఁ బెట్టి,యభవున కర్పింప ♦ నతివ గోరె

తే. నేత్ర నీలోత్పలంబుల♦నీలగళుని, యర్చనము సేయఁ జింతించె ♦ నంబుజాక్షి
గర్భగోళమునందున్న ♦ యర్భకునకుఁ, గలగుణంబులఁ దెలిపెడు♦కరణి నపుడు.

ఉ. ప్రొద్దులు చొచ్చె నంత పుపుఁ◆బోఁడికిఁ బెంపుడుచిల్కపిల్లకున్
సుద్దులు చెప్ప, వస్త్రములు◆సొమ్ములు దాల్ప, నిజేశుపాన్పుపై
నొద్దిక నుండ, నిత్యము గృ◆హోచితకృత్యము లాచరింప, మై
బెద్దయు శ్రాంతిఁ గాఁ దొడఁగె ◆ బిడ్డఁగనన్ సమయం బగావునన్. 25

చ. చెలువకు బిడ్డకుట్లు విల◆సిల్లఁగ భిల్లపురంధ్రు లంతలోఁ
బిలువరె మంత్రసానిఁ దల◆పెట్టరె కాయముఁగూర్పు లేమకున్
జలకముఁ గాఁపరే కొలను ◆ చయ్యనఁ ద్రవ్వరె మందగామినిన్
నిలువఁగనీకురే యనుచు◆నేర్పరులై కడు సంభ్రమింపఁగన్. 26

సీ. శుభముహూర్తంబున ◆ నిభరాజగామిని, శివభక్తి మునుపైన◆శిశువుఁ గనియె
సంసారమోహపా◆శముఁ గోసినటువలె, బొడ్డు గోసిరి పిన్న◆బిడ్డనికిని
సర్వేశు భక్తిల◆క్షణముఁ దెల్పెడు రీతిఁ, బెట్టిరి భూతిలోఁ◆ బట్టిపట్టిఁ
బాపకదంబదం◆బాలంబుఁ గడిగెడు, పగిది నీళ్ళార్చిరి ◆ పావనికిని

తే. యంతరంగమలాపహం◆బైనచిత్తు, ధ్యానమున నోనిచిట్టాము◆కంబు దెచ్చి
బాలకు కడుపునఁ బెట్టి◆పద్మముఖులు, పవ్వళింపఁగఁ జేసిరి ◆ పాన్పుమీఁద. 27

క. జ్ఞానప్రసూనకళికా, జాని పదధ్యానపరమ◆సౌఖ్యసుషుప్తిం
దైనగతిఁ గన్ను దెఱవం, గానేరకయుండె కొన్ని◆సుప్రంబులకున్. 28

క. ఈలోకవ్యాపారం, బేలాగో యనుచుఁ జూడ◆నింపైనగతిన్
బాలకుఁడు దెఱచెఁగన్నులు, లాలితముగఁ దల్లిదండ్రు◆లకు ముదమొదవన్. 29

సీ. శివభక్తిరహితమై◆చెడియె జగం బని, నవ్విన ట్లొయ్యన ◆ నవ్వసాగె
ధృతి మోహబంధంబు◆ దెగఁ దన్నుగతి ముద్దు, టడుగులెత్తి విదుల్చు◆కాడఁబొచ్చె
భవపరాఙ్ముఖుఁడైన◆పగిది సత్త్వముఁగూడి, పొత్తులపాన్పుపైఁ◆బోరగిలఁబడియె
శ్రేయోమహారాజ్య◆సింహాసనంబున, నుండుచందమునఁ గూ◆ర్చుండఁదొడఁగెఁ

తే. దడవియాడె వసుంధరా◆స్థలమునందు, విశ్వపతి తత్త్వ మనుమణి◆వెదకురీతి
దర్పకారి జగత్పూర్ణుఁ◆దాఁకుభీతి, నడుగు వెట్టెడుగతిఁ దప్ప◆టడుగు వెట్టె. 30

వ. ఇట్లు ప్రతిదినప్రవర్ధమానంబులగునతనిగుణంబులకు శివభక్తిలక్షణోపమానంబులు సమానంబులై చెలువొందఁ దండ్రియుఁ బుళిందబృందారకుండును నందను తిన్నదనంబున కానందకందళితహృదయారవిందులై తిన్నఁడని పేరువెట్టిన సప్పాడవ్యక్తమధురకల్యంబగు బాల్యంబున. 31

మ. జలకంబార్చి, విభూతిఁ బెట్టి, కటిగుం◆జాబీజసంకీర్ణమే
ఖల బంధించి మయూరపత్త్రలతికా◆కాండంబులం జేసి సం
దులదండ ల్సవరించి కన్నుఁగవ కాం◆తు ల్కాటుకం దీర్చి మం
దుల తాయెత్తులు గట్టినన్ శబరపు◆త్రుల్ గూడి యాడం బురిన్. 32

సీ. చిల్లబొల్లాకాయ♦సిరిసింగణావర్తి,గుమగుమగుంచాలు♦కుందెనగుడి
డాఁగిలిముచ్చులా♦టలు గచ్చకాయలు, వెన్నెలకుప్పలు♦తన్నుబిల్ల
తూరనతుంకాలు♦గీరనగింజలు,పిల్లదీపాలంకి♦బిల్లగోడు
చిడుగుడుప్వాలపోటి♦చెండుకట్టినబోడి,యుల్లియుప్పనబట్టె♦లప్పకోలు
తే. చిక్కనాబిల్లలోటిల్లు♦చిందఱాది, యైన శైశవక్రీడావి♦హారసరణిఁ
జెంచుకొమకులంతోడ ను♦ద్దించుకాముఁ, డిన్నఁడభినవబాల్యసం♦పన్నుఁడగుచు. 33

## తిన్నఁడు విలువిద్య నభ్యసించుట.

ఉ. కొంచెపువింటఁబద్ద బరి♦గోలలు గైకొని చాపవిద్య సా
ధించు నెడన్ సలంఘునగ♦తింజను లేడిని సింగి నిచ్చ వ
ర్తించు ఖగంబు నేయఁగని♦తిన్నఁడు దేవునిపాలుగాక సి
ద్ధించునె తల్లిదండ్రులకు♦దృష్టిగుణంబున నంద్రు లుబ్ధకుల్. 34

తే. విల్లుపట్టిన నెలపది♦నాళ్ళలోన, వీఁక గలిగిన తడవిల్లు♦వెదురువిల్లు
సెలసువిల్లును మొదలైన♦చేఁగవిండ్లు,చులుకగాఁదీసి శబరేంద్ర♦సూనుఁడేయు. 35

వ. అసమయంబున నవయౌవనం బాసన్నం బగుటయుఁ దిన్ననికి బహువిధమృగయా
విహారంబుల నెఱుంగఁ దెలుపవలయునని వనచరు లెఱుకు జేనికిన్ విన్నవింప
నింపెసలార నాతం డాటవిక పుటభేదనంబునం గాటి జేనిజాతరకుం బూటం బనుపనను
పమేందు నీలనీలకుటిలకుంతలజాలఫాలపట్టికలం జిగురుఁబోండ్లు మంజరీమంజులస్తనభా
రంబులు, బిసకాండమండితదోర్దండంబులు, నెమలిపురిదండలు, కర్ణంబుల నవతంసీ
భూత మయూరపర్ణంబులు, ఘనంబులగుజఘనంబుల మీఁదఁ బొఱుటాకుల చీరలు,
కొప్పులఁ గురువకప్రసవగుచ్ఛంబులు, నచ్ఛంబులైన యరుణచరణకమలపటుభా
గంబుల లాక్షారసంబులును, సాటువలేని లేడిచూపులం దూటాడించు కటారిమిటారి
చూపులుగల కనుఁదమ్ముల మిరునమ్ములం జమరుపాసటంబువోని కాటుకయుఁ బునుఁ
గును బచ్చకస్తూరియు జవ్వాదియు వాసించి పరిమళించు నడవిపసుపు నునుఁబూఁత
యుం దనర వనచరవనరుహానయనలు తిరుగం జాటిన మఱునటి మంగళవారంబున
నివ్వరిబియ్యంబునఁ బుప్పొలవలె నుండ వండివార్చిన యుపహారభాండంబులు చమరీ
మృగంబుల పాలకు ననుకూలంబైనగునుకుండ్రాలపాయసంబులకుండలుకీచకతండులం
బులం బిండిగొట్టి కొట్రఁబోసి యుప్పి గొప్పలుగాఁ జేసి యావించినకుడుముల బానలు
కాళింగభంగసంగతలశునవాసనాపిశితంబులగు పిండికూరలచట్లనుబచ్చగందనీక పరి
పాకంబులుచేసిన వనీశాకంబుల వెనల్లును నానావిధమాంసంబులయటికలు గుడాగు
డగుడపుప్పతాలహింతాలతండులజనితాసవకలశంబులును గంపలను గావిళ్లను బెట్టి
బలి వెట్టుటకై వనక్రోడ తామ్రచూడ మహిషాజావికపరిముఖాటవికమృగంబులం
బట్టుకొని బంతికట్టుకొని కాటేరినిగుడికి నడుమునప్పుడు తప్పెటలచప్పుళ్లును వెట్టి

సారకాయల బుఱ్ఱలంగట్టిన సరకట్లకిన్నరలు మెఱయ మొరయించు మ్లేచ్ఛులపాటల తానమానంబులును గుమ్మెటలచటులరవమును గొమ్ముల నిమ్మును జెలంగె నయ్యవసరంబున. 36

తే. ఒక్కప్రొద్దుండి సెలయేటి♦నుదకమాడి, నాథనాథుండు తండ్రియు♦ నైజమైన
చతురలంకారములు దాల్చి♦సహజభక్తి, నాత్మజునిఁజూచి కైసేయు♦ మన్ననతఁడు 37

మ. జలకం బాడి విభూతి పెట్టుకొని రు♦ద్రాక్షమాలి కామాలికా
వలయంబుల్దొడి దట్టిగట్టుక శిరో♦వర్ధిష్ణునీలాలకం
బుల లేఁదీఁగను జుట్టి కేల విలునమ్ము ల్పూని కాంతిచ్చిప్రా
జలు సేయన్ ... తెం గుమారుఁడు పితృ♦స్వాంతంబు లుప్పొంగఁగన్. 38

చ. చని మృగయాధిదైవతము♦సన్నిధి బాణశరాసనాదిసా
ధనములు నిల్పి మెట్టవిరి♦దండల నివ్వరిప్రాల రక్తచం
దనమున గుగ్గిలంపుఁబొగ♦దట్టుపునుంగున నెత్తుజోతులన్
ఘనవివిధోపచారములఁ♦గానుకలన్ శబరాళి గొల్వఁగన్. 39

తే. తల్లిదండ్రులుఁ దాను న♦ద్దైవమునకుఁ, బ్రణతులొనరించి వేఁటలు♦వట్టి పిదపఁ
జక్కణములోని శబరదం♦పతులతోఁ, సన్నపానాదు లొనరించు♦నవసరమున. 40

సీ. మాటలాడఁదలంచి♦మఱచిపోయెడువారు, నడవఁబోవుచుఁ దొట్రు♦పడెడువారు
నారికుండెడమని♦ యుండనోపనివారు, లేచెదమని లేవ♦లేనివారుఁ
బనిలేని పనిబట్టి♦బయలువెట్టెడువారుఁ, బాడనేరకయును♦ బాడువారు
నెదురైనవారికి♦ నెల్ల మొక్కెడువారు, వ్రీడావిహీనులై♦యాడువారుఁ

తే. జాలఁద్రావియునగుడఁజే♦సాఁచువారుఁ, దొడరియుపదంశభాండము♦ల్దోడుకువారు
నైరి మృగయాధిదైవత♦యాత్రయందుఁ, బానములు చేసి శబరదం♦పతులు రతుల

ఉ. నాతియొకర్తు చిత్తము న♦నాథునిపై నిడి సారెసారె మో
హాతిశయానఁ బోతె నధి♦కాసవ మిచ్చి నిజేశుఁ గూర్చి య
ల్లాతని నాథుపేరనె ప్రి♦యంబునఁ బిల్చుచుఁ గౌఁగిలించి హా
లాతురతాత్మికాగతి వి♦లాసము చూపుచుఁ గూడె వేడుకన్. 42

చ. పుడిసెఁడు గాని లేదిపుడు♦పుచ్చుక త్రాగిన మద్య మింతలో
నొడఁ లెఱుఁగం డటంచు నొక♦యుగ్మలి నాథునిఁ దిట్టి యన్యునిన్
జడియఁడు చూడు మంచు సర♦సంబున మెచ్చు తెఱంగు దోఁప న
వ్వడు బిగికౌఁగిటం గదిస♦పుంజనుగుబ్బల నొత్తె మక్కువన్. 43

ఉ. ఉత్తమనాథుఁ డీతఁ డెడ♦నుత్తరమీఁ డొకనాఁ డదేమొకో
యిత్తఱి రేఁగి రేఁగి తన♦యిచ్చకువచ్చిన వెల్ల నాడెడిన్

గ్రొత్తలుగాని యీమధువు♦కుండల మాటలు నాఱిపోసి రో
యత్తె యటంచు నొక్క శబ♦రాంగన వల్లభు దూఱె సారెకున్. 44

ఉ. మంకెనపువ్వులో విడిసి♦మత్తిలియుండెడు తేఁటిరీతి మీ
నాంకసరోజరాగకలి♦తాధరశాంతరనీలలీల హా
లాంకరితారుణచ్ఛవిస♦మంచిత లోచన తారకద్యుతుల్
వింకముఁ జూడఁ బానముల♦పెక్కువఁ జొక్కిరి భిల్లదంపతుల్. 45

## తిన్నఁడు పరిజనంబులతోడఁ గూడి వేఁటకు వెడలుట.

వ. ఇవ్విధంబున మధుర మధు రసాస్వాదనామోద మేదుర వినోదంబులం గేలిసలిపి నిషాదమిథునంబులు సదనంబులకుం జనునప్పు డుద్యాటనికాధీశతనయుం డాఖేటకం బునకుం గాటి జేనిపాటియగుంగాక! యని యొనరించు దీవనలుల్లసిల్లఁ బల్లియం బ్రవే శించి చెంచుతేఁడు మఱునాఁడు రేపకడఁ గొడుకుం గూర్పఁదగిన వారలం గూర్చి. వేఁ జకుం జను మనవుడుఁ దెరచీరకట్టలు ప్రోఁగుచుట్టలు దొడ్డివల లేటివలకుం దేటివల పం దివల సవదండవల ముకరివల యెలికవల మొదలుగా వలయు వలలును, సివ్వంగులుఁ గుక్కలుఁ గృష్ణకురంగంబులు ముంగిసలు నెద్దులు మొదలుగా వేఁటకు దిద్దిన జంతు వులు, తోరణంబులు సెలకట్టెలు సాధనంబులు గిద్దెలు వేసడంబులు మున్నుగా విడివేఁ టకు నెన్నందగిన విహంగంబులును, బూరేడు కారుకోడి కేరజంబు కొంగ కక్కెర చింద లాదిగాఁగల పాదివేఁటకుం బ్రోది చేసిన పతంగంబులు, నుసులు నురిగోలలు బోనులుఁ జిక్కంబులు జిగురుఁగండెలుఁ దీవుఁద్రాళ్ళు నొడిత్రాళ్ళుఁ దలముళ్ళును గొని శరశరాసనప్రభృతిసాధనంబులతోడ నడవి కేతెంచి నిశ్శంక సకలమృగసంకుల సంకలితంబగు వేంకటాచలంబు వంకం డెంకి వెట్టుకొని. 46

సీ. ఒకనాఁడు తెరవేఁట♦నుగ్రసత్త్వంబులఁ, బుడమిపైఁ బడఁ గాల్చి♦పడ వధించి
యొకసారి సారమే♦యోద్ధతి నుద్ధుర, స్తబ్ధరోమంబుల♦ సంహరించి
యొకమరి దీనంబు♦ లొడ్డి పాదులుదీర్చి, బహువిహంగంబులఁ♦ బట్టితెచ్చి
యొకవేళ డేగవేఁ♦టకుఁ జని యొగజోపి, నానాండజముల పా♦ణములు గడపి

తే. ముంగివేఁ టేనువేఁట సి♦వంగివేఁట, యిఱ్ఱివేఁటయు గంటవేఁ♦ టెద్దువేఁట
మొదలుగాఁగల వేఁటల♦యదనెఱింగి, తిన్నఁడొక్కొక్కతూకువ♦ర్తింపఁ దొడఁగె.

చ. పులులు కురంగము ల్కరటి♦పోతము లేదులు మన్నుబిళ్లు దు
ప్పులు కణఁతు ల్కిటు ల్చెవుల♦పోతులు కొర్నవగండ్లు భల్లుకం
బులు చమరీమృగంబు లెను♦పోతులు కస్తురిపిల్లు లాదిగాఁ
గలమృగరాజిఁ బెక్కువిహ♦గంబులఁ గానుక లంపెఁ దండ్రికిన్. 48

ఆ. మునుపు వడిన మెకముఁ♦గొనివచ్చి మిడిగ్రుడ్లు,♦పొడిచి నీట శిరము♦దడిపి తోఁకఁ
గోసి ధూప మిచ్చి♦ మీసంబుఁ బెకలించి, కానుకిచ్చి కాటి♦ జేసిఁ గొలిచి.

ఉ. క్రొవ్విన యేకలంబులను • గొన్నిటిఁ గూల్చి కమర్చి పంచులం
జివ్వచు నెఱ్ఱమ స్నలఁడి • చివ్వన నీరిపురంగ నేర్చి నో
ళ్లువ్విళులూరఁ బ్రేల్చి చము•రుట్టిపడం గఱుకుట్లు గాల్చి క
ల్లువ్వులనీడ నొక్క పరి•శుద్ధ శిలాతల భూమి నందఱున్. 50

క. అట్లు కఱుకుట్లు గాల్చిన, పిట్టల నిండ్లెట్ల నుఱిముఁ • బెర తేనియలం
బెట్టుక మెసఁగుచు నాథుని, పట్టికి నింపెసఁగ నిట్లు • ప్రతిదివసంబున్ 51

ఉ. ఆవనవీథిలోఁ గలమృ•గావళిఁ బత్తుల సంహరించి పూ
ర్వావనిభృత్తటాటవుల • నాటవికుల్ మృగయావిహారముల్
చేవ దలిర్పఁ జేయుచుకు • శీఘ్రము పాళియు మొత్తి కుంభజ
గ్రావసు తాప్రతీర గిరి•కాననమధ్యమున న్వసించుచున్. 52

ఆ. అంజనాటికొండ•లందు సదాశివు,కొండ జమునిదిక్కు • వెండికొండఁ
జెండ సత్త్వ చండ•సంహార తాండవం, బాడఁ గోరి వేఁట•లాడు సవుడు. 53

క. ఒకవేళఁ దిన్నఁ డాఖే,టక ఖేలా వ్యసన రతుల • డస్సినవాఁడై
వికచప్రసూనవకుళ,ప్రకరంబుల నీడ నొంటిఁ • బడి నిద్రింపన్. 54

స్వప్నముచేతను వేఁటమిషను నీశ్వరుఁడు తిన్ననివశీకృతుం జేసికొనుట.

మ. ఒడలం బెల్ల విభూతిపూఁత పులితో • లోఁ డ్డాణ మల్లాడు కెం
జడ లాత్తైకవిచార నిశ్చలదృగ•బ్జాతంబు లప్పై చ్చిన క
చ్చడ మంసంబున రుండమాల గొడే•శిస్థాణువుం గ్రాలఁగా
నొడయం డొక్కఁడు దక్కనూరునికలలో • నుద్యత్కృపామూర్తియై. 55

క. బాలక! యిచట శిలాసట,మూలంబునఁ గొండదండ • మొగలేటి దరిక
శైలసుతాపతి భక్తుల,పాలిటి పెన్నిధి వసించు • భక్తిం గొలుమీ. 56

క. అని యంతర్ధానము సే,సినఁ దిన్నం డదరిపడుచు • శీఘ్రంబున మే
ల్కని నలుదిక్కులు వెదకుచు, మనమున నాశ్చర్యరసని•మగ్నుం డగుచున్. 57

శా. ఈల ల్వ్రేఁకెలు దిక్కులం జెలఁగఁ దా • మెచ్చ మృగశ్రేణిపై
గాలిం బోవక సన్న దప్పూటయు రొ•క్కారొక్కముల్ దిట్టి శా
ర్దూలక్రోడ మృగాదుల న్వలబకుం • దోలంగఁ దిన్నండును త
త్కేళీలోల రవంబు దన్నుపుడు బో•ధింపంగ నేతెంచినన్. 58

మ. వలతుం జేరక ప్రోఁగులుం బెరలు ద్రె•వ్వం ద్రొక్కి యాఖేటక
స్థల ముల్లంఘన సేసి లుబ్ధకుల య•త్నంబెల్ల వారించి ది
క్కులు దద్ఘుర్ఘుర ఘుర్ఘుర ధ్వనులచే • ఘూర్ణిల్లఁగా నొక్క యే
కల మేగం గని తిన్నఁ డప్పుడు ధను•ష్కాండోల్లసత్పాణియై. 59

మ. జవ మొప్ప న్వాను వెంట నంటి తఱుమన్ ♦ సంవర్ధితక్రాంతి ను
ద్దవిశిం బొఱఁగలేని చందమునఁ జెం♦తం జేరఁగా నిల్చి యే
య విచారించిన దూఁటి దాఁటుకొని త♦న్నాశ్శాశలం ద్రిప్పి పా
శవిముక్తుం డగు యోగిభావన యదృ♦చ్ఛావృత్తి వర్తించుచున్. 60

క. అలయించుచుఁ దిన్నఁడు దన, కలలోపలఁ గన్న శివునిఁ ♦ గనఁగొనుదాఁకన్
జలమునఁ గొని చని యద్యో, కల మవ్వ డదృశ్యమైనఁ ♦ గమఁజోద్యమునన్. 61

క. కలలోఁ జెప్పిన యొడయుం, డెలయించుక వచ్చినట్టి♦యేకలము హిమా
చలతనయాధిపమాయా, విలసనములు గాఁగ నవుడు ♦ వివరించి మదిన్. 62

శా. సంతోషంబునఁ గాంచెఁ దిన్నఁడు సను♦స్తవ్యాపకానంత వే
దాంత స్థాపిత చిన్మయాంగము నవి♦ద్యాధ్వాంత సంతాన సం
క్రాంత స్వాంత నిశాంత జంతు సుఖమా♦ర్గప్రాపకాభంగరు
క్కాంతాపాంగము దివ్యలింగము వివి♦క్తధ్యేయ నిర్లింగమున్.

తే. కాంచి రోమాంచకంచుకో♦దంచితాంగుఁ, డగుచునానందబాష్పంబు♦లతిశయిల్ల
నమ్మహాలింగమునకు సా♦ష్టాంగనతులు, సేసి ముకుళితహస్తుఁడై ♦ చేరఁబోయి. 64

తిన్నఁడు శివలింగమునకు సేవఁజేయుట.

శా. ఓసామీ! యిటువంటి కొండదరిలో ♦ నొంటిం బులుల్ సింగముల్
గాసిం బెట్టెడు కుట్రనట్టడవిలోఁ ♦ గల్జువ్విక్రీనీడ నే
యూనం గట్టితి వేటిగడ్డ నిలు? నీ♦ వాఁకొన్నచోఁ గూడు నీ
కేసుట్టంబులు దెచ్చి పెట్టెదరు? నీ ♦ కిం దేటికే లింగమా? 65

ఉ. కొండలఁ గానలం దిరిగి ♦ క్రొవ్విన పందుల లేళ్ల దుప్పులన్
జెండినఁ జెక్కుచందములఁ ♦ జిన్నక పెద్దక గాఱుకమ్మఁగా
వండుదు రట్ల సిట్టలను ♦ వండుదు రిచ్చట నుండనేల? నా
కొండొక టానతీక యుము♦మ్మూరికి రాఁగదవయ్య లింగమా! 66

క. ఓలింగమ! విను నివ్వరి, ప్రాలును నోడిపిల్లు గునుకుఁ♦బ్రాలును వెదురుం
బ్రాలును నవరవుమెకముం, పాలును గల వచట నీకుఁ ♦ బాయసమునకున్. 67

తే. పుట్టతేనియ పెరతేనె ♦ పుట్టజున్ను, తొఱ్ఱతేనియ గలవందుఁ♦దోఁచితోఁచి
కాలి దులములనై పిండి♦పోతరాలు, నట్టె నింజెట్లు గలవు నీ♦ కారగింప. 68

సీ. నేరేడుపండులు ♦ నెలయూటిపండులుఁ, గొండమామిడిపండ్లు ♦ దొండపండ్లుఁ
బాలపండులు నెమ్మి♦పండులు బరివంక, పండులుఁ జిటిముటి♦పండ్లుఁ గలివె
పండులుఁ దొడిపెంద♦పండ్లుఁ దుమ్మికిపండ్లు, జానపండులు గంగ♦రేనుపండ్లు
వెలగపండులు పుల్ల♦వెలగపండులు మోవి, పండ్లు నంకెనపండ్లు♦బలుసుపండ్లు

తే. బీరపండ్లును బిచ్చుక♦బీరపండ్లు, గొబ్బిపం డ్లీతపండ్లును♦గొంజిపండ్లు
మేడిపండ్లును మొదలుగా♦గూడిమూడి, చెంచెతలు దెత్తు రిత్తువి♦చేయవయ్య

శా. ఇల్లో ముంగిలిలో యనుంగుఁజెలులో ♦ యీడైన చుట్టంబులో
యిల్లాలో కొమరో తరింపవశమే ♦ యేపోఁడుము ల్లోక ! మా
పల్లెం గోరిన వెల్లనుం గలవు తె♦ప్ప ల్గాఁగ నీ కిచ్చెదన్
జెల్లంబో యిట నొంటినుండ కటు వి♦చ్చేయుంగదే లింగమా ! 70

తే. చఱుకుఁజూపునఁ గాలిన♦కొఱ్ఱెత నఱుకు, నఱుకుఁజూపులఁబుట్టించు♦నెఱుకువారి
యిఱుకువలిగుబ్బపాలిండ్ల♦యిగురుఁబోండ్ల, సేవకిచ్చెద నీకు వి♦చ్చేయవయ్య. 71

మ. నను మన్నించెదవౌ విభుఁడ రా ♦ నా వెంట, రాకుంటివేన్
నిను నేఁ బాసి చనంగ నోప, నిచట ♦ న్నీతోడిదే లోకమై
మనువాఁడం, గనువాఁడ నీకరుణ, నీ♦మానంబు చిత్తంబు న
చ్చినవౌ మానుదుగాని నిన్నువుడు క♦ష్టింబెట్ట నా కేటికిన్. 72

వ. అని యమ్మహాదేవు నమ్మూరికి రమ్మనుచుం బ్రార్థించినం బలుకకుండినం దదీయభ
క్తిపరవశుండై సంగతావిఁ బ్రుంగిన భృంగంబు తెఱంగున నున్న యవసరంబునం
దిన్నం డొంటిపంది వెంటందగిలి యొంటి నెక్కడఁ బోయెనో యని బోయలు చొ
ప్పరయం దివిరి యడుగుల వెంబడిం బడితప్పక చనుదెంచి కాంచి యిట్లనిరి. 73

—తిన్ననిం గని బోయలు దుఃఖించుట.—

శా. అన్నా! నిన్నలయించి తెచ్చిన వరా♦హం బెందుఁ బోయెనొ? స్నముకన్
గన్న న్నిన్నునఁ జూడ వేటికి? వడిన్♦గన్నీరు గాఱంగ నే
మన్నన్ బల్కవదేమి కారణమొ? వేఁ♦టాడంగ నేతెంచి యి
ట్లున్నం దల్లియుఁ దండ్రియు న్మఱుఁగరే ♦ యుల్లంబులో నక్కటా ? 74

తే. నీదు గాలికిఁ బసివట్టి ♦ నిత్తునీల్గి, నక్కడెడలు బిగఁబట్టిన♦మట్టుపడక
నిలువకే తెంచి వేఁటకు♦క్కలు కమార, చుట్టుక గునిసియాడంగఁ ♦ జూడవేమి.

సీ. వలలునుఁ దెరలుఁ బ్రోఁ♦గులుఁ జుట్టఁగా లేదు, పోటుకో లొకటియుఁ♦బుచ్చలేదు
తెగిన మొకంబులఁ ♦ దేలేదు విడివేఁట, పిట్టలకును మేఁత♦ పెట్టలేదు
చెంచు లేరికి నేమి ♦ సేద దేఱఁగలేదు, చెడకుండ మొకములఁ♦ జేయలేదు
కుక్కలిట్టులు నివం♦గులు మేపుఁగొనలేదు, బలివెట్టి కాట్రేనిఁ♦గొలువలేదు
తే. వేఁటలాడంగ వచ్చిన♦వేడుకల్ల, నక్కటా తండ్రి కెఱఁగింప ♦నంపలేదు
ప్రమానుపడియుండ నేటికి♦మేనుమఱచి, యేల మాజాలి మాన్పవే♦యెఱుకపఱచి.

శా. ఓ తండ్రీ! నిను డించి పో మనసు మా♦ కొక్కింత గానేర్చునే ?
మీ తోఁబుట్టులుఁ దల్లిదండ్రులు చెలు♦ ల్కీర్కెల్ల నేతేరఁగా

మాతిన్నం డిపు డెందుఁ బోయె ననిన ♦ న్మాప్రాణము ల్వోవె? రా
వే తిట్టింపక పల్లెలోన మముఁ, దే♦వే వన్నెయు న్వాసియున్. 77

తే. ఎంత యలమటఁబడిన మ♦మ్మేలచూడ, వింతయు నెఱుఁగఁ జేనికి ♦ నెఱుకపఱుపఁ
బోయెదము చెప్పవలసిన♦బుద్ధి చెప్పి, యనుఘ్రమని పాదములు పట్టు♦కొనిన నతఁడు.

వ. ఎట్టకేలకు శివలింగసంగతాభంగురహృదయాంతరంగుఁడగు శబరపుంగవుండు కృపా 79
పాంగుండై చిఱునవ్వు నవ్వి యవ్వనచరుల కిట్లనియె.

క. ఈలింగములోఁ బ్రాణము, కాలముగడదాఁక నోడఁ ♦ గట్టినదూలం
బై లంకె నుండఁ జేసితి, నేలా తుందుడుకు? పల్లె♦ కేగుఁడు మీరల్. 80

క. నావెంట నితఁడు వచ్చిన, నేవచ్చెద మిమ్ముఁ గూడి ♦ యిప్పుడు లేదా
యేవంక నభవుఁ డుండిన, నావంక నె తోడునీడ ♦ యై వసియింతున్. 81

శా. నాకుం జుట్టముఁ దల్లిదండ్రులుఁ జెలు ♦ ల్నాథుండు నీడై వమే
మీ కిచ్చోఁ బనిలేదు కష్టపడఁగా ♦ మీవల్లెకుం బొండు, కా
రాకూరంబులు చేసినం గదలి నే♦రా, నిచ్చటం బ్రాణముల్
పోఁ గార్తుం దుది నాదువేలుపునకై ♦ బొంకన్నిజం బింతయున్. 82

క. అని శివుఁ గ్రమ్మఱఁ దిన్నఁడు, మనమున నిలుపుకొని తనువు♦ మఱచిన బుద్ధిన్
మునుపటి తెఱఁగున నుండిన, వసరుచు వనచరులు చనిరి ♦ వలసిన రీతిన్. 83

వ. తదనంతరంబ. 84

తిన్నఁడు శివుని కనుదినంబు నాహారం బొసంగుట.

క. ఎన్నేండ్లనుండియో ప,స్తున్నాఁ డీయడవిలోన ♦ నొంటి మహేశుం
డిన్నాగులు మాన్ప వలదా, కన్నారం గనిన బంటు♦ గలఫల మనుచున్. 85

శా. తిన్నం డంతట దేవదేవునకు భ♦క్తిం దృప్తిఁ గావింప నా
నన్నగ్రావ మహాటవు ల్దిరిగి సం♦స్తారింటక కోటీ పుట
చ్ఛిన్న త్ర్యాజ వరాహము స్గడపి కా♦ల్చ న్వ్రేల్చఁ బ్రేల్చం జవిన్
జెన్నై యుండెడు మాంసఖండముల ని♦చ్చం దొప్పలం జొప్పడన్. 86

ఉ. విల్లొకచంక నంపపొది♦వీఁపున దొప్పలు కేలుదోయి పు
క్కిళ్ల పవిత్ర కాంచనము♦ఖీజల మొప్పఁగ వచ్చి భక్తిరా
జిల్లఁ దదంబుమజ్జనము♦ సేయుచు దొప్పలనంజు డదిరా
జల్లుని నారగింపు మన ♦ నాపరమేశ్వరుఁ డారగించినన్. 87

క. కాలవో క్రొవ్వవో మాఁడం, గాలెనో చవిగావో♦ కమ్మగావో నీకున్
జాలవో యలవడవో తిన, వేలా కఱుకట్లు పార్వ♦తీశ్వర! చెపుమా? 88

క. ఆఁకలిగాదో భక్తిం, దేకువ గలవాఁడఁగానొ ♦ తినవేల కృపన్
సాఁకఁగదే నన్నిప్పుడ, త్రెక్కలఁ బెట్టక పలాశ♦నాసక్తుఁడవై. 89

క. నేవ మొకటి గలదె నాపై, నుపవాసముతోడ బడలి♦యుండఁగ నీకే
యపరాధము సేయంగదె, కృపతోఁ గటుకట్టు లార♦గింపఁ గదవే. 90
క. నీ వారగింపకుండిన, జీవన మేమిటికి నాకు♦శివ ! నీ పదరా
జీవముల మీఁదఁ బ్రాణము, వే విడుతు నటంచు వ్రాలి♦యేడ్వం దొడఁగెన్. 91
క. తిన్నని భక్తికి శివుఁడు ప్రసన్నుండై యేను ఫుడిపి♦సరగునఁ గటుకు
ట్లన్నా ! తినియెద లేలె, మ్మన్న న్మదమంది లేచి♦యవధానమునన్ 92
క. అందియ్య శివుఁడు తగ నానందించుచు నారగించి♦న న్మదమున మి
న్నంది పులిందేంద్రుఁడు కానం దిరుగుచు నిట్లు దినది♦నంబును గొల్వన్. 93

శివబ్రాహ్మణుఁ డాలయమందలి రోఁతలఁ గని చింతించుట.

సీ. పంచాక్షరీ పూత♦భసిత త్రిపుండ్రాంకి, తాంకభాగములు స్నా♦నార్ద్ర శిఖయుఁ
గ్రమకృతగ్రంథిసూ♦త్రవ్రాత రుద్రాక్ష,భూషణంబులు శైవ♦భాషణములు
నాగుల్ఫలంబమా♦నాంబుకోణంబైన,శోత్రంబు నుపవీత♦సూత్రములును
గరగృహీతాభిషే♦కక్షీరసంపూర్ణ,భాండంబుఁ బుష్పక♦రండకంబుఁ
తే. గుండబొజ్జయు నొకపాటి♦గుజ్జుఁబావు, నుత్తరీయంబుఁ దనరంగ♦నెమోగిహృదయ
గోచరుని గొల్వ శివచిహ్న♦గోచరాంకు,డొకఁడువచ్చె శివబ్రాహ్మ♦ణోత్తముండు.
తే. వచ్చి గుడిచొచ్చి యీశ్వరే♦శ్వరుని నిర్మలాంగ మేటికిఁ జాటికి♦లమ్మె నకట
యిచటి కెంగిలి పుల్లియ♦లేల వచ్చె,నొకొ యీదుఃఖ మెటువలె♦నోర్చువాఁడ.
మ. కులదైవం బని యక్కఁ బూసి♦గుడి ముగ్గు ల్బెట్టి కై సేయ లో
పలి కెంగిలి మంగలంబులగు దో♦షప్రల్ రాఁ గతం బేమొ? ని
ర్మల తోయ స్నపనం బొనర్చిన శరీ♦రం బేటికి న్నీవు వ
ట్టులు గట్టం భవదాత్మశుద్ధి కిది గూ♦డుంగా మహాహేయముల్. 96
క. దేవా! యీకసుమాలము, దేవెను కేల్దోయి నీదు♦దేహం బంటన్
గా వెఱపయ్యెడు నెంగిలి, కీ వెట్లోర్చితివి పార్వ♦తీశ్వర చెపుమా? 97
క. నేఁడేడు దినములయ్యెన్, బోఁడిమి చెడసాగి నీదు♦బూటకమో యె
వ్వాఁడైనను జేసెనొ యిది, వేఁడెద సత్యంబుఁ జెప్పు♦వే కరుణాబ్ధీ. 98
ఉ. నీసఖుఁడో సుతుండొ తరు♦ణీమణియో నిజసేవకుండొ నీ
వో సకలేశ శుద్ధమగు♦చున్న నిజాలయసీమ రోఁతఁగాఁ
జేసిన వారు నీకెఱుక సేయక♦ సేయ సమర్థులవ్వ రీ
దోసముఁ జెప్పవే కరుణ♦తో మదిఁ దుందుడుకెల్లఁ దీఱఁగన్. 99
ఉ. ప్రాఁతలు మీఁదఁగప్పినఁ గృ♦పామతి నోర్చితి, నీచుపొత్తునన్
బ్రాఁతి మెసంగి తీవు, మను♦భక్తుఁడు కుంటెనఁ బంపఁ బోతి, మై

పూఁత యొనర్చుకొంటి శివ ♦ భూతిఁ, గపాలమునం భుజించి తీ
రోఁతలు పెక్కు లుండ నిట ♦ రోయుదువే యిఁక భక్తవత్సలా. 100

క. నీకిష్టం బిదిగాని, నా కాపాపాత్ముఁ జెప్పి ♦ నం బదిలకుల్
లేకున్న విమతుఁ బోయెదము, నీకై కూఁ డుగ్గఁబట్టి ♦ నీలగ్రీవా. 101

క. అని తా నూరక యుండినఁ, గని తారాధిపకళాశి ♦ ఖామణి చేతో
జనితాదరమున నతనికి, వినిచి తాత్పర్యంబు సంభ ♦ వింపఁగ ననియెన్. 102

శివుఁడు తిన్నని భక్తిని శివబ్రాహ్మణునకుఁ జూపుట.

క. తవతవపడ నేటికి మది, శివగోచర! నీకు నన్నుఁ ♦ జెందొకఁడు తిరిగి
వ్యవహారేతరమతమునఁ, దవిలి మహాభక్తిఁ గొలువ ♦ దయ పుట్టుటయున్. 103

తే. ఆకిరాతుని పూజ సంగీకరించి, నాఁడు దద్భక్తి నీవును ♦ నేఁడు మాతు
గాని నా వెన్క దిక్కునఁ ♦ గానకుండ, నడఁగియుండుము తడయక ♦ యతఁడు వచ్చు.

మ. అన మోదించి హరద్విజుం డొదుగఁ జెం ♦ చవ్వేళ నేతెంచి పా
వననిర్మాల్యముఁ జెప్పఁ గాలఁ గొని పో ♦ వం ద్రోచి గండూషతో
వననేకం బొనరించి పత్త్రితతిచే శ్రో ♦ వర్గ్గాచి తా నేసి కా
ల్చిన కోలామిషఖండముల్ దనకు భ ♦ క్షింపంగ నందిచ్చినన్. 105

క. తినకున్న నేమొకో యని, యనుమానముఁ బొంద నభవుఁ ♦ డంతటిలోనన్
గనుదమ్మి గ్రమ్మి పొటపొటఁ, జినికె న్నెత్తురు శబరు ♦ చిత్తం బదరన్. 106

క. ఒకమారి కొకమారి కించి, త్ప్రకటారుణావద్ధ పత్త్ర ♦ వీథిని గళి
త్సకరంద ధారగతిఁ దన, ముకుళిత నేత్రముల బొమ్మ ♦ ములు ఘనమైనన్. 107

క. అంతనతఁడు దందడనందనుఁ, డాందోళము నొంది కంటి ♦ నంటిన నొప్పిన్
బందికొలుకుట్లు దినఁడేఁక, నందియు మేమిటికి మందు ♦ సమకూర్పఁదగున్. 108

వ. అని తిన్నం డన్నఁడు తేని హానిం బూనినవాని తెఱంగున నంతరంగంబునం దరంగం
బులైన దుఃఖంబునం గరంగుచు. 109

తిన్నఁడు పరమేశ్వరు నేత్రరోగమునకుఁ జికిత్సలం జేయుట.

సీ. కోశపొట్లం బావిఁ ♦ గొనసూఁదియొత్తుచుఁ, గిషణోష్ణ కరభభా ♦ గమునఁ గాఁచి
నత్తితం గేడాకు ♦ మొత్తి రేచకి నిమ్మ, వంటిపుల్పున నూఱి ♦ పట్టువెట్టి
తెల్ల దింటెనపువ్వుఁ ♦ దెచ్చి తద్రసమిడి, కలి వెపువ్వులు గోసి ♦ నిలిచి పిడిచి
వేరిన నెయి వెట్టి ♦ పెరుఁగువత్తులు వైచి, చనుఁబాలతో రాచి ♦ సంకు చమిరి

తే. పిన్నమందులు తానెఱి ♦ కన్నమందు, లడిగి తెచ్చిన మందులు ♦ నడవిమందు
లెన్ని చేసిన మానక ♦ యుండ మహాళి, కన్నుతోడఁ బడి నెత్తురు ♦ గాఱుటయును.

శా. మీపూర్ణం బగు దివ్యతేజము జగ♦న్మిథ్యాత్మకత్వ ప్రతి
ష్ఠాపారీణతఁ జూపి మమ్ముఁ బొదవం♦జాంచల్యదూరంబులై
చూపుం జిత్తము మిన్నకున్న యది యి♦చ్చోఁ బాసె దేహంబుపైఁ
దీపుం జీఁకటి యింతకంటె వరమే♦దీ యిట్లు మన్నింపవే. 123

చ. జగములు నంతరాత్మయును ♦ సాక్షియు నీ వనుచు న్నిజంబుగా
నిగమము లాడఁగా వినియు ♦ నేఁ డితరంబుగ మాకభీప్సితం
బగువర మెట్లు వేఁడఁగలమయ్య ♦ భవన్మయమైన పూర్ణచి
ద్గగనములో మముం గలిపి ♦ క్రమ్మఱఁ బుట్టను గాఁగ మాన్పవే. 124

క. ఇతఁడు కిరాతుం డేదు,స్మృతి మమ్మడిగెను మహేశ ♦ మన్నించి ప్రస
న్నతఁ జూపితి కీ తెఱఁగున, హితశీల భవప్రయాస ♦ మెడలింపఁగదే. 125

క. మీతలఁపుకన్న నధికమె, మాతలఁ పిట్లుమగ నేల ♦ మము మీ చిత్తం
బే తెఱఁగున వెలుఁగొందెదు, నా తెఱఁగున నుండఁజేయు ♦ మదిగాక శివా. 126

క. ఆనందామృతవారిని,ధ్యానంబున మనము మగ్న♦తం బొందె వరం
బీనమరినఁ దాదాత్మ్యం, బో నిరుపాధికదయాన♦ముజ్జ్వల! యీవే. 127

మ. అని శైవద్విజుఁడుం గిరాతుఁడును సా♦ష్టాంగ ప్రణామంబు నీ
శునకుం జక్కఁ నొనర్చి తద్విమలతే♦జోధ్యాననిర్మగ్నభా
వనులై యుండఁ బ్రపంచబుద్ధి మగుడ♦న్వర్తింపఁగా నీక వా
రి ననంతం బగునాత్మరూపమునఁ గూ♦ర్చెం దీర్చె బంధంబులన్. 128

శా. ఓహో! వీరలు భక్తిఁ గన్న యపవ♦ర్గోదగ్రభాగ్యంబు లా
హా! హాలాహలభక్తభోక్తృ నిజభ♦క్తాగణ్యకారుణ్య మం
చా హేరంబ సితాంబుజాంబక విధా♦త్రాశాప యోగీశ హా
హాహాహూహూప్రభృతు ల్నుతింప నభవుం ♦ డంతర్ధి నొందె న్వడిన్. 129

క. అనవుడు యాదవ భూపతి, పునరభివాదనముఁ జేసి ♦ భూతేశు కృపన్
గని కెవ్వ రింక మోక్షం, బనఘా! యచ్చోట నన్న ♦ నతఁడిట్లనియెన్. 130

## నత్కీరునికథ, మధురాపురవర్ణన.

సీ. కపటచతుష్షష్టి♦గతుల నాడిన వాల,వాయి నక్కీరుని♦వాసభూమి
యతని పట్టపుదేవి ♦ యైన మీనేక్షణా,ధరతనూభవకుఁ బ్ర♦ధానగృహము
ద్రవిడభాషాపీఠ♦తలశంఖఫలకంబు, గల కనకాబ్జపు♦ష్కరిణి కిరవు
దక్షిణాంబుధి వధూ♦తామ్రపర్ణి నది, సవతు వైఘురు నెన్నఁ ♦ జాలు నునికి
తే. నిజదృగబ్జప్రపూజిత ♦ నీలకంఠ, కూడలళగియ వైకుంఠ♦కుంఠితాఘ
నిఖిల సంపత్పరంపరా ♦ నిహితకింప,చాముతాపంబు మధురాభి♦ధానపురము. 131

తే. ఆపురంబునఁ జెంపొందు ♦ నిందుమధురఁ, బాండ్యభూపాలు డల్లుఁడై ♦ ప్రజలకెల్ల
నుల్లములలోన నుల్లాస ♦ ముల్లసిల్ల, నట్టి మధురకు సరియె యే ♦ పట్టనంబు. 132

క. గంగాధరుని మహోగ్రా,పాంగము రతి విధవఁ జేసె ♦ నాలోపల మా
యంగయకన్యాంబ కృపా,పాంగం బంగజుని దేవి ♦ నైదువఁ జేసెన్. 133

సీ. మాణిక్యవల్లియు ♦ మరకతవల్లియు, నానందవల్లియు ♦ నమృతవల్లి
కర్పూరవల్లియుఁ ♦ గల్పకవల్లియు, నంగయకన్య య ♦ నంగనాది
యైననామంబుల ♦ ననుకూల మగుమోహ, నాకారసౌందర్య ♦ మతిశయిల్లఁ
బొత్తామరనియెడు ♦ నెత్తమ్మికొలనిప, శ్చిమతటనికటకూ ♦ లమున నుండి

తే. లోకమాతృక పాండ్యకన్యా ♦ త్రినేత్ర, సుత్రికామణి యువతి సం ♦ పూర్ణచంద్ర
వదన రక్షింప సంపదం ♦ బొదలు మధుర, కితర పురములు సరిసేయ ♦ నెట్లు వచ్చు.

కం. ఇట్టిమహాత్త్వంబునఁ గను,పట్టును తల్లిఁ గెల ప్రజల ♦ భాగ్యం బిల నే
పట్టున నున్నది పురము, నెట్టు నుతింపంగ వచ్చు ♦ నిందున కెనగాన్. 135

క. తన పేర్మిం దనసేవయుఁ, దనదుప్రసాదంబు నొసఁగి ♦ దయ నంగయక
న్య యగజ పెంపఁగఁ బురి మను,వసితల వైభవముఁ బొగడ ♦ వశమే వసుధన్.

శా. ఏమే కల్పకవల్లి రావమృతవ ♦ ల్లీ పోవ కర్పూరవ
ల్లీ మాణిక్యలతా యిదో మరకతం ♦ బెండుంబొ నానందవ
ల్లీ మీనాక్షులు రండటంచుఁ దమలో ♦ లేమల్వివాహోగవే
ళా మంజూక్తులఁ బిల్చు సంభ్రమ మన ♦ ల్పం బెప్పుడుం దత్పురిన్. 137

ఉ. ఆపుర మేలు భూవిభుఁ డ ♦ నంతపరాక్రముఁ డప్రతర్క్యభా
శ్రీపరిపాలనప్రథిత ♦ ధీనిధి వైరినృపప్రతాపసం
జ్ఞాపతి వాసవాధిపయ ♦ శస్సముదీర్ణుఁ డుదీర్ణదానవి
ద్యాపరకర్ణుఁ డర్ణవస ♦ మగ్రగభీరుఁ డుదారుఁ డెంతయున్. 138

చ. అతఁడయ లోకనాథశివుఁ ♦ డల్లుఁడు మూర్తి హిమప్రభానము
జ్జ్వలఘనకీర్తి ధైర్యమును ♦ శౌర్యము భూభరణప్రభావముం
దలఁప నశక్యమై వెలయుఁ ♦ దత్పురి పాండ్యనృపాలుఁ డేలు ని
చ్చలు మిహికామహీధరము ♦ చందమునం గులగోత్రపాత్రుఁడై. 139

వ. తదనంతరంబ. 140

## శంఖఫలకము పుట్టిన క్రమము.

సీ. మలయాచలంబునఁ ♦ గలశతనూజుండు, ద్రావిడశబ్దశా ♦ స్త్రము నిఘంటు
వయ్యలంకారంబు ♦ నందుఁ గవిత్వంబుఁ, జెప్పెడు లక్షణ ♦ స్థితియు మొదల
సృష్టింపఁ దలపోసి ♦ యష్టాదశాక్షర,మాతృక వ్రాసి ని ♦ ర్మలిన శంఖ
ఫలకంబుఁ గొనివచ్చి ♦ పాండ్యభూపతి కిచ్చి, వినుమిది ద్రవిడక ♦ విత్వసరణి

తే. భారతీదేవి కెనయైన♦వార లెంచ, గ్రైనం జోటిచ్చు నొక్కరుం♦డైన నతని
కిచ్చుం దగినట్లు కూర్చుండ♦నెడము దీని, నరున నర్పించి మనుఁడు మీం♦తరతరంబు.

క. అని కుంభజుఁ డిచ్చిన వెను,క ననేకులు పాండ్యనృపులు♦ గడచిన పిదపన్
జనియించెఁ గలియుగంబున, జనవల్లభుఁ డొక్కఁ డతని♦ సద్వంశమునన్. 142

క. ఆరాజు పాండ్యధాత్రీ,ధౌరంధర్యప్రముఖాది♦తగ్రావహరి
ద్వారణభుజంగపతిభూ, దారకమతపరివృఢప్ర♦భానిధి యగుచున్. 143

క. ద్రావిడభాషాదేవీ,గ్రైవేయక మనఁగ గీర్తిఁ♦ గని తత్కవితా
శ్రీవిపుల శంఖఫలకము,పై వసియింపంగఁ దగు వి♦భాసితమతులన్. 144

శా. నత్కీరాది కవీంద్రులన్ దివిషద♦న్నప్రాయవాగ్గుంభనం
పత్కావ్య ప్రతిపాదక ప్రతిభులం♦బన్నిద్దఱన్ శైవసం
విత్కాసార మరాళరత్నములఁ ద♦ద్విద్యారసాపేక్ష భూ
భృత్కంఠీరవుఁ డుంచె సంపదలఁ దృ♦ప్తిం బొందఁగాఁ జేయుచున్. 145

క. ఆసభ మెచ్చఁ గవిత్వం, జేసరసుఁడు చెప్పిన స్మ♦హీశుం డిచ్చున్
జేసత న్మాడలువే, యోసి దెసలఁ గీర్తిలతిక♦ లెలమి నహింపన్. 146

చ. అడిగిన దిచ్చు నర్థులకు♦నాప్తుల కిచ్చు మనంబుఁ, గూటమిం
బడఁతుల కిచ్చు సౌఖ్యములు♦ బంధుజనంబుల కిచ్చు సంపదల్,
పుడమి నమస్తజాతులకు♦బొంకమి నుత్సవ మిచ్చు, శత్రులన్
బొడవడఁగించి సాధుజన♦పుంగవకోటికి నిచ్చు వేడుకల్. 147

## దుర్భిక్ష వర్ణనము.

క. ఆభూవిభుఁ డిబ్బంగిని, భూభాగం బేలుచుండు♦ బుట్టెన్ గ్రహావ
క్రాభద్రకోపమహా, క్షోభంబు జగంబు వర్ష♦శూన్యము గాఁగన్. 148

సీ. చనుదెంచె శని మీన♦మునకుఁ దూర్పున, ధూమకేతువు దోఁచె♦జీమూతడంబ
రం బేచె మధ్యంది♦నంబుల రేపాడి, చినికెఁ దుషారంబు♦దినదినంబు
రాత్రులు మిన్ను ని♦ర్మలభావమును బొందె, వెలియుండగాసె గ♦ర్వాలివారంగ
వర్షగర్భము నడ♦వకపోయె విదియలఁ, గుముదాప్తధారణ♦కొమ్ము దఱిగె

తే. కన్య భిన్నింపదయ్యె మ♦ఘాప్రవేశ, కాలమున నుఱుమదయ్యె న♦ఖండగర్జ
లెనఁగె జముదెసఁ దోలకరి♦ నేమి సెప్ప, నెల్లజనములమనములు♦దల్లడిల్ల. 149

వ. మఱియును. 150

తే. గునుకు లూదర్లు బరపటల్♦గోళ్ళగొండు,లల్లిబియ్యంబు వెదురుబి♦య్యంబు గొట్టి
చెట్లు నింజెట్లు తుంగము♦స్తియలు నీఁత,గుంజ మొదలుగఁదినదొరఁ♦కొనియెజనము

క. అఱువదు గంటె తవిందియు, లఱువది దినములకుఁ బండు♦ నని బ్రదుకొనన్
దఱచుగ నేతాలెత్తఁగఁ, బఱిపఱియై యవియు మల్లె♦పడి చెడి పోయెన్. 251

ఉ. తోలును నెమ్ములు న్నిగిలి ♦ గ్రాసినఁ బొంబడి చొట్టఁ గూలువా
రాలిని బిడ్డల న్విడిచి ♦ యాఁకటిచిచ్చున వచ్చిపోవువా
రేలికబంటువాసి రొక ♦ యించుక లేక కృశించు వారునై
తూలె జనంబు మీనశని ♦ దోషము దాఁకి నిరస్తసస్యమై 153

క. నవయుచు నుండియు నొక్కొక, దివసంబున నశన మబ్బఁ ♦ దిని దగ మిగులన్
భువి నొరగి లేవ నోపక, శివశివ! జనకోటి విడుచు ♦ జీవానిలముల్. 154

క. కఱవంతంతకు నొత్తఁగఁ, గరవెరుక లేనంగనోపఁ ♦ గలుగక మనుజుల్
సురసుర ప్రుక్కి కొందఱు, పరదేశంబులకుఁ జనిరి ♦ బ్రతుకుల కొఱకున్. 155

క. మానిసి మానిసిఁ దినుకఱవై నం దరిగింపలేక ♦ యాపురిమూల
స్థానహరద్విజుఁ డొకఁ డెం, దేనియుఁ బోఁ దలఁచిన న్మ ♦ హేశుఁడు కరుణన్. 156

ఈశ్వరునిపద్యముఁగొనిచనిన హరద్విజుని నత్కీరుఁడుతూలనాడుట.

వ. అతనికిఁ బ్రసన్నుండై యన్నగరంబేలుమన్నుఁ జేసిమీఁద నజరశాసఁబద్యంబు
శృంగార రసానుబద్ధంబుగా నొకటి చెప్పియిచ్చి యిది చదివిన మెచ్చి వేయిమాడల
ముడుపిచ్చు వెచ్చంబునకొదవు నీవు నెవ్వగ నొక్కవ్వక బ్రతుకంగలవాఁడ వంతటఁ
గఱవుం దీరు జగంబునఁ గృతహర్షంబగు వర్షంబుఁ గురియంగలదు సస్యంబులు
పండఁ బండు జనంబులకవునని యనుపుటయు నతండును నారాజ సమ్ముఖంబునకుం
బోయి శ్రీపరమేశ్వర ప్రణీతంబైన కవితాచమత్కారంబు వచించిన నందలియర్థంబు
"సింధుర రాజగమనాధమ్మిల్లబంధంబు సహజగంధం" బని యుండుటం జేసి 157

క. దానికి నవ్వుచు నృపసభ, లో నత్కీరుండు పలికె ♦ లోకము నగదే
పూనుకొని సహజగంధము, వేనలికిం గలదటన్న ♦ వేయు తెఱఁగులన్. 158

ఉ. తప్పిది, చెప్ప రాదు, కవి ♦ తానమయంబున కొప్పఁగాదు, నీ
విప్పగిది ప్రచింపఁ దగు ♦ నే? యన విప్రుఁడు చిన్నఁబోయి నా
కప్పరమేశ్వరుండు వసు ♦ ధాధిపుపై రచియించి యిచ్చినాఁ
డొప్పును దప్పు నే నెఱుఁగ ♦ నుత్తములార! యటంచుఁ గ్రమ్మఱన్. 159

ఖిన్నుఁడైన బ్రాహ్మణుని శివుఁడూరార్చి నత్కీరునితో వాదునకుఁ గడంగుట.

ఆ. వచ్చి పార్వతీశు ♦ వంకఁ గనుంగొని, యతని పద్య మతని ♦ కప్పగించి
నిన్ను నమ్మి పోయి ♦ నిండిన సభ సిగ్గు, చెడితి నున్న కథలు ♦ చెప్పనేల. 160

క. సర్వజ్ఞత్వము బహుముఖ, నిర్వాహకశక్తిగుణము ♦ నీకుఁ గలుగఁగా
శర్వ! నినునమ్మి పౌరుష, గర్వముఁ బోనాడుకొంటిఁ ♦ గడపట సభలోన్. 161

క. తా నెఱిఁగిన విద్య నృపా, స్థానములో నెరపఁ గీర్తి ♦ సమకూరుం గా
కేనరునకుఁ బరవిద్యా, ధీనత భూపాల సభలఁ ♦ దేజము గలదే? 162

క. నీమాట నమ్మి పోయిన, నామానముఁ జెప్పనేల ♦ నత్కీరునిచే
నేమాట పడ్డ దుఃఖము, తా మన్యథ కొలఁదిగాదు ♦ సద్భక్తనిధీ! 163

వ. అని మఱియు నిట్లనియె. 164

శా. నాభాగ్యం బిటు లుండఁగాఁ దుది నిను ♦ న్నత్కీరునిం దూఱఁగా
నేభావ్యం బిఁకఁ బాలు; నిక్కమవుచే ♦ నిల్లైతి, నంధైనఁగా
నీ కైతంబునఁ గుక్షిఁ బ్రోచుకొని దీ ♦ నిం దీర్చి నేవత్తు, దే
వా! భద్రం బగు నీకు నన్నునుపవే ♦ యన్నం గృపామూర్తివై. 165

క. కటకట నన్నత్కీరుం, డిటు కవితయుఁ దప్పనట్టి ♦ నట యటు పదవిరా
యెటువలెనో తెలిసెద నని, నిటలాక్షుఁడు వచ్చి కుంభి ♦ నీపతి సభలోన్. 166

శా. ఈరాజన్యునిమీఁద నేఁ గవిత సా ♦ హిత్యస్ఫురన్మాధురీ
చాతుప్రౌఢిమఁ జెప్పి పంప విని మా ♦ త్సర్యంబు వాటించి న
త్కీరుం డూరకె తప్పనట్టివట యే ♦ దీ లక్షణంబో యలం
కారంబో పదబద్ధమో రసమొ చ ♦ క్కం జెప్పఁడా తప్పనన్. 167

క. అనవుడు నానత్కీరుఁడు, మునుపటివలెఁ దప్పటన్న ♦ ముక్కంటియు నా
తని కనియె న్గిరితనయా, ఘనకచభారంబు సహజ ♦ గంధం బనుచున్. 168

క. అగజకు నైనం దగు నిల, మగువలకుం దగదు ♦ మాను మత్సర మింకన్
గగనప్రసూనవాదము, జగతిం బ్రత్యక్షమునకు ♦ సరియనఁ దగునే. 169

క. లూలామాలవు మాటలు, చాలు ననిన నలిగి తననిజం బగు రూపం
బాలోనఁ దెలుప వలెనని, నీలగ్రీవుండు నిటల ♦ నేత్రముఁ జూపన్. 170

క. తలచుట్టువారిఁ గన్నులు, గలిగినఁ బద్యంబు దప్ప ♦ గాదన వశమే?
వల దిచ్చట నీమాయా, విలసనములు పనికిరావు ♦ విడువు మటన్నన్. 171

శివుఁడు నత్కీరుని శపియించుట.

క. శపియించెం బ్రతిభావలఁ, గుపితుండై రుద్రుఁ డతనిఁ ♦ గుష్ఠవ్యాధిం
దపియింపు మనుచు దానికి, నపరిమిత భయంబు నొంది ♦ యతఁ డిట్లనియెన్. 172

శా. స్వామీ! ద్రోహముఁ జేసితిం, దెలుపవే ♦ శాపాంత ముద్యత్కృపా
ధామా! నాకనుచుం బదాబ్జముల మీఁ ♦ దం బడ్డ నాభక్తర
క్షామందారుఁడు శాంతిఁ బొంది యనియెం ♦ గైలాసశైలంబుఁ గం
టే మానుం బదమన్న నందునకుఁ దా ♦ డెందంబునం గుందుచున్. 173

శివుఁ డిచ్చినశాపమునకు నత్కీరుఁడు దుఃఖించుట.

ఉ. ఈకవితాభిమానము వ ♦ హించితి నేటికి? శంఖపీఠిపై
నీకవు లున్నయట్లు వసి ♦ యింపక దేవునితోడ నేల చా

ర్వాక మొనర్చితిం? గడుభ♦రంబగు కుష్ఠరుజావిషాదమే
నే కరణిం ధరింతు? నిక♦నెన్నఁడు చూచెద వెండిగుబ్బలిన్? 174

ఉ. ఎన్ని మహానదుల్, వనము♦లెన్ని, గిరీంద్రములెన్ని, బోయపల్
లెన్ని, మృగంబులెన్ని, జన♦హీనములైన పథంబులెన్ని, నే
నిన్నియుఁ దాఁటి యేకరణి♦నీశ్వరు శైలముఁ జూడఁ బోయెదన్?
గన్నది కాదు విన్నయది♦గాని సదాశివ! యేమి సేయుదున్. 175

మ. హరి శార్దూల మదేభ ఖడ్గ శరభ♦వ్యాఘ్రమ్ములా[illegible]
త్కర సంచార నివాసముల్ హిమపయో♦ధారాప్రవర్షంబు లు
ద్ధుర సంఘర్షణ [illegible] కోపలము లా♦[illegible] సనగ శక్యమే
కరుణాసాగర! భక్తవత్సల! శివా♦ గౌరీశ! యెట్లో గదే. 176

సీ. తివిరి యంగమ్మునఁ♦గిమ్ములెత్తకమున్న, గొనుడ లెల్ల మచ్చలఁ♦జెడకమున్న
దళమెక్కి గాత్రంబు♦చెలువుదప్పకమున్న, బుసపులు మేన నే♦ర్పడకమున్న
యలఁత విగ్రహమున♦నంకురింపకమున్న, కాయంబు వెడహావు♦గాకమున్న
తనువునఁ జీము ర♦క్తములు గాఱకమున్న, దేహ మిగులు మాఁగి♦ శిథిలకమున్న

తే. శైత్యమడుగంగఁ బోయిన♦పట్ల జనులు, చూడ రోయకమున్న శా♦లాశినపుడ
నడవవలెఁగాక కైలాస♦నగముఁ జూడ, హరుని వాక్యంబు శక్యమే♦పరిహరింప. 177

## —— నత్కీరుని తీర్థయాత్ర. ——

తే. అనుచుఁ జింతాపరంపర♦ లనెడు వర్ష, ముడిగి నత్కీరుఁడను మేఘుఁ♦డుత్తరంబు
నడచెనంతోషమున దక్షి♦ణమున నున్న, కవుల ముఖపంకజములు వి♦కాస మొంద.

వ. కతిపయ ప్రయాణంబులు చనిచని ముందట 179

శా. చెవ్వం దీశ్వరు నీశ్వరేశ్వరునిఁ గాం♦చెన్ భీమ[illegible]లతల్
దెవ్వం దీవ్రతరాంగసంభవశర♦శ్రేణీ విదాహవ్యథల్
విప్వం దీరని భక్తితో హృదయ మా♦ విర్భూతమోదంబునన్
నవ్వం దీఁగయుఁబోలెఁ జూడ్కులొదవ♦ న్నత్కీరుఁ డత్యంతతన్. 180

ఉ. చెంగట నుండఁ గాంచెఁ గవి♦సింహము పోయి హిమాచలాత్మజో
త్తుంగకుచోపగూహనవి♦ధూతమనోభవభూతిలేపన
ర్వాంగము, లోచనీకృతసు♦ధాంశుకృశానుపతంగము, న్వని
ర్లింగము, జంబునాథశివ♦ లింగము, భక్తమనోబ్జభృంగమున్. 181

చ. చని చని దాఁటె నంతఁ గవి♦చంద్రుఁడు ధన్యఁ గవేరకన్య, జీ
వనశితఖడ్గఖండితభ♦వప్రభవాఘవిరోధిసైన్యఁ, బా
వననిజనామసంస్మరణ♦ వారితమానవదైన్య, నిత్యమ
జ్జనరతకోటిముక్తిపద♦సౌఖ్యవదాన్యఁ, గృతావగాహుఁడై. 182

వ. ఇట్లు తటినీరత్నంబు నుత్తరించి యుత్తరాభిముఖుండై కొన్ని తీర్థంబులుదర్శించి. 183

చ. అరుణగిరీంద్రకూటముఁ, గృతాఘకపోలచపేటముం, నిరం
తరభవదావపావకవిదాహకృపీటము, పుణ్యకోశమం
దిరవిలసత్కవాటముఁ, బ్రదీపితముక్తివధూకిరీటముం
బరిహృతసంతతభ్రమణభారపదశ్రమభానుఘోటమున్. 184

క. ఉణ్ణాముల జగదంబిక, నణ్ణామల విశ్వనాథు నారాధించెన్
మణ్ణాసయుఁ బొన్నాసయుఁ, బెణ్ణాసయు లేనివారి పెన్నిధు లగుటన్. 185

క. తదనంతరంబ యక్కడ, కదలి నడిచి యెదుట విష్ణుకాంచనగర్భుల్
మొదలైన దేవకోట్లం, జదివించినయొజ్జఁ గాంచె సజ్జనసురభిన్. 186

మ. తిరువత్తూరి పురాధినాయకు మహాదేవుం శివు న్ముక్తివా
రిరుహాక్షీపతి నోదిపిచ్చ నయనాగింగొల్చి యాపిమ్మటం
బరశంభుం బనమార్గమూర్తిఁ గరుణాపాథోనిధానంబు నే
కనసాలేశ్వరుఁ గాంచి కారమణు లోకస్వామిఁ దర్శించుచున్. 187

వ. అనర్గళాపవర్గంబగు నప్పురంబు నిర్గమించి కొన్నిప్రయాణంబులు చని విక్రమసింహ
నగరాసన్నయగు పెన్నయుఁ, దీర్థయాత్రాపరులకు సురతరువుకొమ్మయగు గుండ్ల
కమ్మయు, సుకృతిభూతపాతకశ్రేణియగు కృష్ణవేణియుఁ, గమలాచలోత్తుంగసంగ
తతరంగయగు గౌతమగంగయుఁ, గుక్కుటేశ్వరపీఠంబగు పీఠికాపురంబును, నం
హోబానుతంగసింహం బగు సింహాచలంబును, వినతిలోభయకర్మం బగు శ్రీ
కూర్మంబును, గలుషాసనిమందూకగోకర్ణంబగుగోకర్ణంబును, తీర్థోత్తమంబగు పుష
రోత్తమంబును, కృత్తివాసోనివాసం బగుకృత్తివాసంబును, ముక్తివధూచరణ
కటకం బగుకటకంబును, దుఃఖదహన జలేశ్వరంబగు జలేశ్వరంబును, కృతవందన
నందనేశ్వరంబగు నందనేశ్వరంబును, జిద్గగనేశ్వరంబగు గగనేశ్వరంబును, పితృ
ముక్తినివాసంబగు గయాస్థానంబును, సేవించుచు నక్కరుండు ననునప్పుడు
ముందట. 188

శా. కాంచెం గాంచనపంకజాత విలసద్గంధాంధసారంగ, ఫే
నాంచత్తుంగతరంగ, వారినిధిశీతాగాంతరాభంగ, గో
మాంచస్వేదజలాశ్రుపూరజనకా శ్యామానందసంపన్మనో
మంచాగ్రస్థితవిశ్వనాథపదసమ్యక్సంగ, గంగానదిన్. 189

వ. కాంచి చేరం జనుదెంచి 190

శా. గంగాస్నానముచేసి విశ్వపతి మోక్షస్వామి దర్శించి పా
పాంగారవ్రజవృష్టినీశ్వరి విశాలాక్షిన్ శివం గొల్చి భ

త్తిం గాలాంతకుఁ గాలకైరవపతిం◆ గీర్తించి దుండీద్విపా
స్యుం గల్యాణగుణాలయుం దలఁచి యా◆త్రోత్సాహ ముప్పారఁగన్. 191

క. కాశీనగరీ పంచక్రోశక్షేత్రంబు విడిచి◆ గుహ్యకనద్రమా
డాశాగమనాభిముఖుం, డై శంకరశైలదర్శ◆నాశాబుద్ధిన్. 192

సీ. ఒకకొన్ని పయనంబు◆ లొయ్యనొయ్యనఁ బోయి, నడువ నోపిక లేక◆ నడుమనడుమ
నడుమఁ బట్టుక నిల్వఁ◆ బడియుఁ గూర్చుండియుఁ, దొంగిదొంగియుఁ గొన్ని◆ జంగ లరిగి
పొడలు పెట్టుచుఁ దన◆ కడు గామడై యుండఁ, జీము నెత్తురు మేనఁ◆ జిప్పిలంగ
నీఁగలు మూఁగియు◆ [illegible]ఁగియు ఝుమ్మ్ఝుమ్ము, మ్మనఁగ నుత్తాల శై◆లాంతరంబు

తే. నిర్మనుష్యంబు బహు[illegible]త్త్వ◆నిష్ఠురంబు, నైన కానన మధ్యంబు◆నందుఁ జిక్కి
దిక్కుఁ గానక దీనతా◆ధీనహృదయుఁ, డగుచు నక్కీరకవిచంద్రుఁ◆ డగ్రభూమి.

ఉ. తమ్ములు కమ్మఁదెమ్మెరలఁ◆ దల్లడమందఁగ ఝుమ్మఝుమ్మనన్
దుమ్మెద పిండు పుప్పొడుల◆తో నెగయం బిసినీలతాంగి కే
శమ్ములు ధూపధూమముల◆ సౌరభము ల్గొలువంగ విచ్చిన
ట్లమ్మొయి నొప్పఁ దమ్మికొల◆ నక్కడ నొక్కటిఁ గాంచె వేడుకన్. 194

తే. హంససంసదభీష్టవి◆హారహేతు, వై బహూదకహృద్యమై◆ యప్రతర్క్య
మగుచు నద్వంద్వమై పంక◆జాకరంబు, పొలిచె బ్రహ్మంబు తెఱఁగునఁ◆ బూర్ణ మగుచు.

క. తమ్ముల రజోవికారము, గ్రమ్మెడు వాసనలు దళము◆గా నెసఁగెడుకో
శమ్ములు నూర్పులుఁ జెలఁగఁగ, దమ్మికొలను భవముఁబోలెఁ◆ దద్దయు నొప్పెన్. 196

చ. దళములలో రథాంగనిన◆దంబు పరాగము రాజహంస సం
కులము శిలీముఖభ్రమణ◆ ఘోషము నవ్యకదంబము ల్సుము
జ్జ్వలతర పుండరీకములుఁ◆ జాలఁగఁ గల్గి మహామహస్థితిం
బొలుపు వహించు నక్కొలని◆ పొంతకు నొయ్యనఁ జేరి యచ్చటన్. 197

## నక్కీరుఁ డొకభూతమునకుఁ జిక్కుట.

సీ. తన పలాశశ్రేణి◆ ధర కంతటికిఁ బచ్చ, పట్టుఁబుట్టంబు మేల్◆కట్టు గాఁగఁ
దనయూర్ధ్వశాఖావి◆తానంబు సురలకు, మరకతరచితహ◆ర్మ్యములు గాఁగ
దన ప్రేలుఁగొమ్మలు◆ మునులకుఁ గల్పిత, పర్ణశాలాకలా◆పములు గాఁగఁ
దన దిశాంతభ్రాంత◆ఘనవిటపచ్ఛాయ, మలయాద్రి హరిణశా◆ద్వలము గాఁగ

తే. వాలఖిల్య మునీశ్వరా◆వాసమైన, రోహణము రీతి పిత్రుముక్తి◆దేహ మగుచు
గయఁ బ్రసిద్ధి వహించు న◆క్షయవటంబు, చందమున నున్న యొక మఱ్ఱి◆క్రింది కేఁగి.

వ. తదీయ శాఖాశైత్యంబున కత్యంతసంతోషంబు నొంది కూర్చుండి తద్వటంబున నుండి రాలిన పండుటాకులు బట్టబయటఁ బడినయవి విహంగంబులు జలంబులం బడినయవి మీనంబులునై పోవ నందొక్క పలాశంబు జలాశయంబున సగమును

దటప్రదేశంబున నగంబును బడి మీనపక్షిత్వంబులఁ గైకొని లోపలికి వెలుపలికిం దిరిగియు చమత్కారంబు నత్కీరుండు చూచి యద్భుతరస పరవశుండై యుండె నంత. 199

ఉ. ఘోర నిరీక్షణ ప్రభల ◆ గ్రుడ్డులుఁ గోఱలు నూర్ధ్వకేశముల్
నీరదనీల గాత్రమును ◆ నిష్ఠురవాక్యము లట్టహాసముల్
ఘోరవకంఠనిస్వనము ◆ భీకర హేతియు మానవాస్థిహా
రారవము లెస్సలంగ వికృ◆టాకృతితో నొకభూత మాతనిన్. 200

క. పట్టికొని తనదు గుహకుం, బెట్టిదముగఁ దెచ్చి మునుపు ◆ పట్టిన మనుజుల్
పట్టఁబడిన పుఱుగులగతి, నిట్టట్టుపడంగ నునిచి ◆ యెంతయు వేడ్కన్. 201

క. వారల నందఱ నేకా,హారముగాఁ గొనఁదలంచి ◆ యయ్యద్రిబిల
ద్వారమున రాయి దోంచి మ,హారయమునఁ గొలన నుదక◆మాడఁగఁ బోవన్. 202

వ. మునువున్న మనుష్యులు నత్కీరునిం గనుంగొని యిట్లనిరి. 203

ఆ. ఏమి సేయవచ్చు ◆ నింతయు మామీఁదఁ, గరుణ లేక కమల◆గర్భుఁ డిపుడు
నిన్నుఁ దెచ్చి పెట్టె ◆ నేఁడింక నందఱఁ, దిను నితండు వీని◆ తెఱఁగు వినుము. 204

ఉ. నూఱుక తొల్లి వీఁడు క◆నుంగొనునంతటిలో మనుష్యులన్
నూఱువురైనఁ గాని తిన◆ నోటికి నాఁటదటంచుఁ గూర్పఁగా
నూఱువురైరి నేటికి మను◆ష్యులు నీవును గూడ, నింతటన్
నూఱును నిండె నిందఱ, న◆నుగ్రహ మీశ్వరుఁ డేమి సేయునో. 205

క. అనవుడు నత్కీరుండును, మనమునఁ దలపోసి దీని ◆ మానుపఁ బురభి
త్తనయుఁడు తారకదమనుఁడు, తనకుం గలుగంగ నింకఁ ◆ దలఁ కేలనుచున్. 206

## నత్కీరుని సుబ్రహ్మణ్యస్వామి రక్షించుట.

ఉ. తారకదైత్యభంజనుఁడు ◆ దారుణశక్తిధరుండు పన్నగా
హారహయుండు దీనజన◆తామరభూజము షణ్ముఖాఖ్యహా
సారథరీవిపాటితది◆గంతకటాహుఁడు వీనిఁబట్టి సం
హార మొనర్చి యిందఱఁ గృ◆పాంబుధియై బ్రతికించుఁ గావుతన్. 207

ఉ. భూతముఁ జంపు చేయనుడు ◆ భోరనఁ దారకు మన్నిగొన్న వి
ఖ్యాతమహాప్రతాపునకు ◆ నద్రిగుహాలయ మేమిదొడ్డ ని
ర్ఘాతమువంటి శక్తిఁగొని ◆ క్రౌంచముఁ జించిన రౌద్రమూర్తికిన్
భీతిఁ దొలంగఁ జేయుటొక ◆ పెద్దయె నారితదేవతార్తికిన్. 208

వ. అని యనేక ప్రకారంబుల బ్రహ్మణ్యోక్తియుక్తంబుగా నిష్టదేవతావరేణ్యుండును భక్తశరణ్యుండును నగు సుబ్రహ్మణ్యు సన్నుతింప ననుకంపాతరంగితాపాంగుండై యతండు చండతరవేగంబునం బయింబడి భూతంబు భూతలంబుపయిం బడం బెడ

చేతనడిచి బిలద్వారంబునం దోఁచిన రాతిఁ దిగిచి వైచి యందఱ వెడలుండని యనుగ్రహించినం డెందంబుల నానందంబునం బొంగి యిందుశేఖరునందను సందర్శించి వందనంబులు సందడించుచు వారెందేనియుం జనిరి. నత్కీరుండును బునఃప్రణామం బాచరించి నిలుచుటయుఁ బ్రసన్నతాంతరంబులు ముఖపంకేరుహాంబునం బ్రభవింప నీ వీయెడకు రాఁ గతంబేమి? యని యడుగుటయు నిట్లని విన్నవించె. 209

క. ఓశరణాగతవత్సల! కాశవనప్రభవ! దీన•కల్పక! రూప
న్నాశకర! దురితగిరి కీ, వేశ ననుం గరుణఁ జూడ•వే సుఖ నగుదున్. 210

ఉ. ఏ నొకతప్పుఁ జేసిన మ•హేశుఁడు నన్ను శపించెఁ గుష్ఠరో
గానుపమవ్యథం బడుమ•టంచును దానికి శాపమోక్ష మి
ట్లానతి యిచ్చె నాత్మనిల•యంబగు రౌప్యనగంబుఁ జూచినన్
మాను నటంచు నక్కుధర•మార్గము దుర్గమ మేమి సేయుదున్. 211

క. ఏలాగున దర్శింతుం, గైలాసం బెవ్వఁగాని•కానక ఖేదో
ల్లోలోర్మి రోగజలనిధి, వేల యనుచు విన్నవింప•విని గుహుఁడు దయన్. 212

శా. కైలాసం బనఁ గాని యుత్తరదిశా•కైలాస మంచాడఁ డా
కాలగ్రీవుఁడు, నీవు దక్షిణదిశా•కైలాసముం జూచినన్
జాలుం గుష్ఠము మాను నంచు మదిలోఁ•జర్చించి యాపర్వతం
బాలోకింపఁగ నశ్రమం బగు నుపా•యం బాత్మఁ జింతించుచున్. 213

తే. తనమహత్త్వమ్ము దాఁచి నె•త్తమ్మికోలని, మహిమ వలె నుండ నాకవి•నుండ తేంద్రు
నాఁడు మింమనఁ గైలాస•మూడఁబోవు, తీర్థ మెదురైనరీతి సి•ద్ధించు ననుఁడు. 214

నత్కీరుఁడు సాయుజ్యము పడయుట.

శా. సేనానీవచనామృతంబు చెవులం•దుందంగ డెందంబులో
నానందం బుదయింప నక్కొలనిలో•నత్యంత నిష్ఠం గృత
స్నానుండై తలయెత్తఁగా నెదుటఁ గా•నన్వచ్చె నాలో నవా
చీనస్థానునగంబు హేమముఖరీ•సింధుప్రతీరంబునన్. 215

శా. కుష్ఠవ్యాధియు మాని హేమముఖరీ•కూలస్థకైలాసమున్
నిష్ఠాధీనమనస్కుఁడై కదిసి త•న్నీరంధ్ర కల్లోలభూ
యిష్ఠౌఘంబునఁ దీర్థమాడి గిరిజా•ధీశున్ శివున్ దేవతా
శ్రేష్ఠున్ సంస్తుతి నూఱుపద్యములఁ జే•సెన్ ద్రావిడోక్తిం దగన్. 216

క. ఆనూఱుపద్యములకున్, సేనానిజనకుఁ డార్త•చింతామణి వి
ద్యానిధి జ్ఞానప్రసవాం, బానాథుఁడు కాళహస్తి•పతి ప్రీతుండై. 217

శా. ప్రత్యక్షంబగుచున్ భవద్భవము సా♦ఫల్యంబునుం బొందె సా
హిత్యశ్రీవర! నీకు నింపగు వరం♦బే నిచ్చెదన్ వేఁడు భీ
తిత్యాగం బొనరించి నాఁడ నన స♦త్కారుం డుమాజానికిన్
ప్రత్యగ్జ్యోతికి మ్రొక్కి మ్రొక్కి ప్రమద♦ప్రాయాంతరంగంబుతోన్. 218

క. నిటలంబున నంజలిపుట,ఘటనం బొనరించి ప్రమద♦గద్గదగళ మ
స్ఫుటవర్ణస్తుతి భాషా,ర్భటియును రోమోద్గమంబు ♦ పైపైఁ బెఱఁగన్. 219

వ. ఇట్లని విన్నవించె. 220

క. ఈసంసారము దుఃఖా,వాసానందంబు దీని♦ వర్జింపంగా
నేసుఖము గల్గు దయ న,న్నాసుఖమునఁ గూర్పవే కృ♦తార్థుఁడ నగుదున్. 221

మ. అని ప్రార్థింపఁగ భక్తకల్పక మవి♦ద్యాసూత్రదాత్రంబు జీ
వనఖేదాంబరకర్తరీముఖము కై♦వల్యార్థదానామృతా
శనరత్నంబు తుషారశైలతనయా♦జాంపత్యసంపన్న పా
వనగార్హస్థ్యము కాళహస్తిపురదై♦వం బిచ్చె సాయుజ్యమున్. 222

శా. ఈరీతిన్ శివుఁ డానతీయ విని ధా♦త్రీశుండు భక్తిన్నమ
స్కారస్తోత్రము లాచరించి పిదపన్ ♦ గౌరీశుఁ బూజించి యె
వ్వారిచొప్పె నపవర్గమార్గమునఁ బో♦వం గాంచి రన్నన్మదిన్
గారుణ్యం బుదయింప నిట్లనియె భ♦క్తప్రీతి భూతేశుఁడున్. 223

శా. యోగిస్వాంత శకుంతవాగురిక! స♦ర్గోపాధిశూన్యా! జగ
ద్యోగా యోగవిహీన! భోగగగనా♦యుక్షీరవహ్న్యంతరా
త్మాగణ్యా! గణనీయమూర్తి! పరమా♦ర్థాకార! స్వాభావ తే
జోగంపూషితపద్మజాండభవచ♦క్షుశ్శ్రోత్రపక్షీశ్వరా. 224

క. అష్టాపదగిరిచాపా, యష్టాపదగర్భకేశ♦వార్చితచరణా
యష్టాపదముఖరిజని, తాష్టాపదకమలవాస♦నాధీనమనా. 225

పంచచామరము. మునీంద్రమానముద్రికాస♦ముక్తముక్తవాసనా
సనాతనాత్మ సేవకార్తి ♦ సారసావళీఘనా
ఘనాఘనా ఘనప్రకాశ ♦ కాయజాగ్ని జీవనా
వనాధినాథ నందనేశ ♦ వాగధీశ పావనా. 226

గద్యము. ఇది శ్రీమత్కాళహస్తీశ్వర చరణకమల సేవాపరాయణ సింగమరమా
నారాయణ జక్కయనారాయణతనూభవ భవపరాఙ్ముఖ ధూర్జటికవిప్రణీతంబైన
శ్రీకాళహస్తి మాహాత్మ్యంబునందుఁ
తృతీయాశ్వాసము.

---

శ్రీ రామాయ నమః

# శ్రీకాళహస్తిమాహాత్మ్యము.

## చతుర్థాశ్వాసము.


కంఠ కంఠభూషిత,
కాకోదరవర వరాక ♦ ఖండనుతవ్యా
ఖ్యాకోలాహలదూరం చి,
దాకృతి యుతకాల కాళ♦హస్తీశ శివా. 1

ఆ. అవధరింపుఁ డిట్లు ♦ భవదీయ కథ విన్న,వింతు భక్తజనుల ♦ వినుతులార
మీరు యాదవునకుఁ ♦ గారుణ్యరసపూరి,తేక్షణముల నాన♦తిచ్చినట్లు. 2

### మధురాపురవర్ణనము.

సీ. రాజులు వీరఘో♦రాజులలో వల,రాజు లౌదురు జయ♦రతికి ననఁగఁ
గొమ్మలగమి కోట♦కొమ్మలెక్కి నిలింప,కుజముకొమ్మలు విరుల్ ♦ గోయ ననఁగ
నాగావళికిఁ జంద♦నాగానిలాస్వాద,నాగమనద్వార ♦ మగడి తనఁగ
శతకోటిరుచిరత్న♦సౌధకోటిప్రభా,కోటి హేళికిఁ బ్రతి♦కోటి యనఁగఁ

తే. బొరుసౌన్నత్యసమున్నతా ♦ భావిభూతిఁ, జొక్కమై ప్రజ సంపదఁ ♦ జొక్కి మెఱయు
హరుఁడు చొక్కేశ్వరుండుమీ♦నాక్షిసతియుఁ, గాపురంబుండు నమ్మధు♦రాపురంబు

ఉ. శ్రీవనజాక్షికిన్ జనన♦సింధువు తత్పురి, బొమ్మరిండ్లు నా
నావసథంబు, లాత్మసఖు ♦ లంబుజలోచన, లాటపట్లు ధా
త్రీవరమార్గముల్, రథహ♦రిద్విరదాదులు బొమ్మ, లాడుని
చ్చానచనావళుల్ నిగమ♦శాస్త్రము లై విలసిల్లు నెప్పుడున్. 4

చ. ధరణికిఁ గంఠభూషణము ♦ తన్నగరంబు, తదీయమస్తకా
భరణము పార్థివాన్వయము ♦ ప్రాణము దానికి రాజనందనో
త్కరము, తదాత్మకుల్ మదన♦దాహారసప్రదవైశ్యవీథి త
త్సరసిజలోచనల్ గుఱుతు ♦ చక్కఁదనంబున వారిలోపలన్. 5

### మాణిక్యవల్లియను వారవనిత శివభక్తిపారవశ్యలగుకూఁతుల నిర్వ్యారం గని పెంచుట.

క. గాణిక్యకలశజలనిధి,మాణిక్యం బగుచు మదన♦మతిముల కిరవై
మాణిక్యవల్లి యనఁగా, నేణాక్షి యొకర్తు వన్నె♦ కెక్కెను బురిలోన్. 6

శా. ఆ వామేక్షణ దైవయోగమున గ♦ర్భాధానముం బొందినన్
వేవిళ్ళయ్యె, నరోచికంబు వొడమెన్ ♦ వెల్లందనం బాస్యరా
జీవవ్యాపకమయ్యె, నోపమి జనిం♦చెం, జూపులుం గుక్షియున్
లావయ్యెన్, విటకోటిసంగసుఖ మ♦ల్పంబయ్యె నాపిమ్మటన్. 7

క. పొద్దుల నెల చొచ్చిన న,ముద్దియకు జనించి రవును ♦ మోహనమూర్తుల్
ముద్దుమొగంబుల కన్యక, లిద్దఱు శివభక్తి తనువు ♦ లెత్తిన పగిదిన్. 8

క. రాజులకొడుకులు గణికా,రాజకుమారికలఁ గన్న ♦ రాజిల్లు మనో
రాజీవము గావున నా,రాజవదన నమ్ముదాంబు♦రాశిం దేలెన్. 9

మ. తలఁ బంకెంచిన నూనె, పుక్కిట సదా ♦ తాంబూలము, న్నేత్రసక
జ్జలమున్, గంధరఁ గట్టుకొన్న వసపూ♦సల్, గబ్బిపాలుబ్బుగు
బ్బలు, నేకాంగుళికార్పి తాలకలన♦ ద్భస్మంబు జిడ్డైన మ
వ్వాలువం, జెల్వుగ బిడ్డకాన్పునడిపెన్ ♦ వామాక్షి బాలింతయై. 10

సీ. అలఁదు నలుంగు దే♦హమున వేణ్ణీళ్లార్పుఁ, దడియొత్తు మెత్తని ♦ ధవళవస్త్ర
మునఁ గాలిఁ బ్రేలి మ♦న్నునబొట్టు వెట్టుఁ గన్నులఁ బెట్టుఁ గాటుక ♦ కడుపునకును
బెట్టుఁ బొత్తులమీఁదఁ ♦ బెట్టుఁ జన్నిచ్చు జో,కొట్టు జోలలు పాడు♦ముట్టిపట్టుచుఁ
దలయుంటుఁ జిట్టాము♦దమున రక్షార్థంబు, మునిఁడికోలలు మంచ♦మునను మర్చుఁ

తే. బ్రాట నులిగాయఁ గూర్చి పా♦దములఁ గట్టు, నుప్పు వేఁ పాకు పైఁ జల్లు ♦ నిప్పు లతివ
దిప్పియిడు దృష్టిదోషంబు ♦ దీర వీథిఁ, బ్రేమ మీఱంగ బిడ్డలఁ ♦ బెంచునపుడు.

చ. కనకపుఁ బేరు సోయగము ♦ గల్గినముత్తెపుఁ గ్రొత్త తొట్లలో
నునిచి యనర్ఘరత్నముల ♦ నొప్పగు గుత్తులు మోఁకుల వ్రేలఁ గ
ట్టిన వెఱఁగంది తెవ్వలు న♦డిల్పక తారకయోగమార్గద
ర్శనరతులట్లఁ గన్గొనఁగ ♦ సాగిరి కన్యలనన్యచిత్తలై. 12

ఉ. కోకిలవాణి పాడుఁ దన ♦ కూరిమిబిడ్డలఁ దొట్లఁ బెట్టి కా
కోకకళావిలాసముల♦కుం గల యర్థము జోలపాటగా
నా కమనీయశైశవము ♦ నప్పటినుండియు వారధర్మవి
ద్యాకుశలత్వ మాత్మజల ♦ కచ్చుపడన్ వలె నంచు నిచ్చలున్. 13

సీ. రతివధూమదనులు ♦ రంభాకుబేరపుత్రకు లూర్వశీపురూ♦రవులు మేన
కాకౌశికులు గోపి♦కాముకుందులు ధాన్యమాలినీరావణుల్ ♦ మత్స్యలోచ

నన్యశృంగులు దాశ♦నలినేక్షణాపరా,శరులు తారానిశాక♦రులు గౌత
మాంగనాదేవేంద్రు ♦ లమరవేశ్యాజయం,తులు ద్రౌపదీపాండ♦వులు పృథాబ్జ

తే. హితులు నడిచిన గతులాత్మ♦సుతలఁ బెంచు, నింటి గోడలఁ వ్రాయించు♦నిందువదన
వనితలకు సరసతకల్మి ♦ వాని వరుస, లేమియును లేమి నాఁల ♦ కెఱుకపఱుప. 14

క. వనిత చతుర్జాతి వయో,వనజాక్షుల బంధవైభ♦వము భద్రుని ద
త్తుని గూచిమారుఁ బాంచా,లుని వారించెఁ గృహాంబు ♦ లోపలిగోడన్. 15

సీ. కూచిమార మనోజ♦ ఘోణికాపుత్రాది,కానీత కామసి♦ద్ధాంతములును
నిరుపమ కలనాద♦ పరివాదినీ వీణ, లాదిగాఁ గల గాన♦యంత్రములును
గీర పారావత ♦ శారికా సారస, హంసాదులైన వి♦హంగములును
దత్తిల భరత మ♦తంగాంజనేయుకా,హళ మత ప్రముఖ లా♦స్యాగమములు

తే. సంతరించె గృహంబులో ♦ జలజనేత్ర, రతులఁ జతురత గానధు ♦ రంధరతలఁ
గంకరనిపుణతల నాట్య♦కౌశలములఁ, జిన్నపనులఁ బాళీల♦ఁజేయుచుండె.

తే. పెక్కు తెఱఁగుల నీరీతిఁ♦బెంచి విసిరి, పంచశరశాస్త్రఁ బద్ద నే♦ర్పాటియైనఁ
బణ్యధర్మంబు మదిలోనఁ ♦ బట్టువడక, శైవధర్మంబె ధర్మంబు♦గా విధించి. 17

—— దాసికూఁతుల చేష్టలు. ——

ఉ. ఆపసిబిడ్డ లేమిజన♦నాంతరవాసనయో కనుంగవం
జూపు లిగుర్చుచో శివునిఁ ♦ జూడఁ దలంతురు, పల్కు నేర్చుచోఁ
దాపసమానసాంబుధిసు♦ధాకరు శంకరు రూపవర్ణనా
లాపములాడఁ బోదురు, క♦ళానిధిశేఖర భక్తియుక్తలై. 18

తే. తోడి వెలయాండ్రబిడ్డల♦తోడఁ గూడి, యాడఁబోదురుగాని పో♦రాడుతల్లి
మనసురాఁ గోరి కన్యకా♦మణులచిత్త, మూను నర్ధేందుశేఖరు ♦ సంగసెపుడు.

ఉ. కన్యకలెల్లఁ గూడి రతి♦కాముల నోఁచఁగఁ దాము భూమిభృ
త్కన్యక నీశునిం దలఁచి ♦ తత్తదలంకృతు లంబికాశివా
జాన్యఖిలార్చనా విధుల ♦ చందముగా వివరించి లోకసా
మాన్య వివాహగానము లు♦మాగిరిశస్తుతి గాఁగఁ బాడుచున్. 20

చ. కనకశలాకలం దెగడు♦కన్యలు గట్టిన బొమ్మరిల్లు శం
భునిగుడి, బొమ్మ శంకరుఁడు ♦ బోనము గుజ్జెనగూడు, వేడ్కఁ జే
సినపను లన్నియుఁ శివుని♦సేవ యొనర్పఁగఁ బద్దపాట్లుగా
మనమున నూహసేయుదురు ♦ మానుని తొల్లిటి జన్మవాసనల్. 21

మ. చదువం బెట్టినఁ బట్ట దాత్మలఁ గులా♦చారప్రధానోల్లస
న్మదనామ్నాయతదంగశాస్త్రములలో♦నన్లేశముం జిదిరిసా

వ్రదశైవాగమ మేకవారమె పఠిం♦పన్వచ్చుఁ గన్యాద్వయం
బుదయంబైన ముహూర్త మెట్టిదొకొ ధ♦న్యు లైచ్చఁగా నిచ్చలున్. 22

సీ. శివపూజనాసక్తిఁ ♦ జిన్నిచన్నులపెక్కు,వయుఁ బ్రత్యహంబును♦నయముఁ జూప
శైవాగమాంతర♦జ్ఞానంబుఁ దనులతా, ప్రభయు సంతతకు ♦ నభినవముగఁ
బార్వతీప్రాణేశ♦భక్తియుఁ గూఁకట్లు, వెలసి నానాఁటికి ♦ వృద్ధిఁ బొంద
వారకులాచార♦వాసనాశాల్యంబు, లోకపూఁట కొకపూఁట ♦ కుడిగి పోవ

తే. శాంభవంబైన తేజంబు ♦ శైశవాన,
గమవసౌభాగ్య లావణ్య ♦ గౌరవంబు
హృదయమున సంగకంబుల ♦ నుదయ మొదవఁ,
జదువఁబోవుదు రిరువురు ♦ మదవతులును. 23

వ. అనసమయంబున నియమంబున శ్రీకాళహస్తీశ్వరునకుఁ గవితాచమత్కారంబు మీఱ నక్కీరుండు చెప్పిన నూఱు పద్యంబులు పాఠంబుచేసి నిత్యవ్రతంబుగాఁ బఠించుచుఁ గఠిన కనకకుచకుంభలు శంభుండే తమకుఁ బరమపురుషుండని యుండఁ బుంద్రేక్షు కోదండ విద్యారూఢ కాంతామతల్లియగు తల్లి దగ్గఱ కేతెంచి యిట్లనియె. 24

## వేశ్యమాత కూఁతులకు వారధర్మ ముపదేశించుట.

మ. వెలయాండ్రండఱు నన్నుతించిరి నను ♦ న్వేనోళ్ళఁ గాణాచికిఁ
గలిగెఁ దిక్కని మీరు పుట్టినపుడే ♦ గారాము నాకింక ని
ష్ఫలమై పోఁ గులధర్మముల్ వదలఁగా♦ భావ్యంబె యోయక్కలా
ర! లతాంతాస్త్రకళావిధిజ్ఞలగు వా♦రస్త్రీలలో నక్కటా. 25

ఉ. ఎన్నఁడు నేర్తురో నడువ ♦ నెన్నఁడు నేర్తురొ మాటలాడఁగా
నెన్నఁడు నేర్తురో చదువ ♦ నెన్నఁడు నేర్తురొ యాడఁబాడఁగా
నెన్నఁడు నేర్తురో కళల ♦ నింపుదలిర్ప విటాళిఁ గూడఁగాఁ
గన్నియ లంచుఁ బెంచిన సు♦ఖం బిటు సేయఁగ మీకుఁ బాడియే? 26

క. కళలుఁ బ్రమాణంబులుఁ జా,పులు జాతులు గతులు బంధ♦ములుఁ బరిరంభం
బులు సత్త్వంబు లవస్థలుఁ, దెలిసి విటులఁ గలిసి కులముఁ♦ దెలుపఁగ వలదే 27

తే. జిహ్వ నాలుక, జలము రా♦జీవదళము, నసుఁ గుమ్మరిపురువు దే♦హంబు, గ్రచ్చ
కాయ బూసిద, పొరయని♦కరణివిటులఁ,గలిసియునుగలియకుండంగ♦వలయులలన.

చ. చిగురునఁబడ్డ రాచిలుక♦ చెల్వున, సంపెఁగపువ్వు తావికిం
దగిలిన మిండతుమ్మెద వి♦ధంబునఁ, దేనియఁ జిక్కునట్టి యీఁ
గ గతి, విటుండు కూర్మిఁ దన♦ కౌఁగిటి పొందునఁ జిక్కియున్న న
మ్మగువకు నేలయిచ్చు నన♦మానధనంబులు రిత్తమాటలన్? 29

మణి, పంచాక్షరి మంత్ర, మహౌషధము భ♦స్మం, బాత్మనాథుండు ద
క్షిణకైలాసవిభుండు, భక్తి దమకుఁ♦ శ్రీ, వాద మింకేటికిన్. 38

సీ. శివు నపేక్షించిన♦చిత్తంబు చిత్తజా,యత్తమై విటులపై♦ నాసపడునె
పరశివ స్తుతికథా♦భాషలు వినువీను, లానునే కుంటెన♦ లాడుపలుకు
లీశ్వరేశ్వరమూర్తి♦ నీక్షింపఁగోరెడు, చూపన్యరూపంబుఁ♦ జూడఁ జను నె
ముక్తివల్లభు సను♦రక్తిఁ గూడఁ దలంచు,కాయంబు గూడునె♦ కాముకులను

తే. హరుని భవహరు శ్రీకాళ♦హస్తినిలయు, వినుతి యొనరించు జిహ్వాక♦మనుజలతికిఁ
బ్రియముఁ జెప్పంగఁ బోవునె♦నయముమీఱ,వారధర్మోపదేశంబు♦వలదు తల్లి.39

ఉ. ఒక్కనిఁ దల్పుమూల మఱి♦ యొక్కనిఁ దల్లిగృహంబులోన వే
ఱొక్కని బోటిగేహమున♦ నొక్కనిఁ జెల్లెలియింటిలోన నొం
డొక్కనిఁ జట్టుముంబలె యు♦ఘోచితచౌర్యరతిప్రసక్తిమై
నొక్కని నొక్కరుండెఱుఁగ♦కుండ రమింపఁగ నమ్మ నేరమే? 40

ఉ. దారువనీమునీంద్రకుల♦దారభుజంగుఁడు, భక్తబల్లణ
స్త్రీరమణాంగనామణిభు♦జంగుఁడు, ముక్తివధూభుజంగుఁ, డీ
చ్ఛారచితాంగభూషణభు♦జంగుఁడు, మాకు భుజంగుఁడమ్మ ని
స్సారమనుష్యమాత్రుఁడు భు♦జంగుఁడు గాఁ డిఁక మాట లేటికిన్. 41

క. మగువకు శరీర మొసఁగిన, మగఁడు చిదంగనకు మగఁడు♦మాయానతికి
మగఁడు మగవేల్పులకుఁ దగు, మగఁడు మగఁడుగాక మాకు♦మనుజుఁడు మగఁడే. 42

చ. అమృతము గ్రోలు జిహ్వ చవి♦యించుఁ దలంచునె తేనె? నింటిలో
నమరమహీరుహం బుదయ♦మైన నరుం డవనీశు వేఁడునే?
యమిజనభాగ్యరూప మగు♦నాదిమతత్త్వము గాళహస్తిదై
వము భజియించుమానసము♦ వారవధూమదసౌఖ్య మెంచునే? 43

వ. అని తన యుపదేశంబు కర్ణప్రవేశంబుగానీక యున్నఁ గన్నతల్లి చిన్నంబోయి. 44

—కూఁతులవిరక్తికై వేశ్యమాత చింతించుట.—

శా. ఈ కేళీసదనంబు లీమృగమదం♦ బీచంద్ర మీచందనం
బీకాశ్మీరము లీతులాంబరము లీ♦హారాది రత్నాంకితా
నేకాలంకృతు లీకరండనిచయం♦ బీతూఁగుమంచంబు లే
నీకన్యార్థముగా ఘటించితిని దా♦ రీక్షింప రింకెట్లొకో. 45

ఉ. కన్నులు చిత్తజాతుఁ డొక♦కాలము నేయని పుష్పబాణముల్
చన్నులు శృంఖలారహిత♦శంబరజిన్మదకుంభికుంభముల్
ప్రన్నని నవ్వు కాఱడవిఁ♦బర్విన వెన్నెల దేహకాంతిసం
పన్నత తప్తహేమరుచి♦ భామలు పల్లవభోగ్య లౌదురే. 46

ఉ. పుట్టనిచిత్తజాతుశరముల్ దెలిగన్నులు, రాజకీరముల్
ముట్టనిపక్వబింబములు మోవులు, చన్నులు నిండుతుమ్మెదల్
ముట్టని పుష్పమంజరులు మోములు రాహువు దంష్ట్రికాగ్రముల్
ముట్టని చంద్రు, లింతు లులి ముట్టని లింగము తోట చిత్రమే. 47

మ. పదకంబుల్ గొలసూళ్ళు బాహుపురులుం బంగారు డంకెంబు లం
గదముల్ ముంగర లుంగరంబులు మణిగ్రైవేయముల్ దెచ్చి యి
చ్చెద మంచుక్ నృపనందనుల్ చెలులచేఁ జెప్పించినం బల్కఁగ
సుదతుల్ వారల జోడ నక్కటకటా సొమ్మెల్ల నమ్మయ్యెనే. 48

ఉ. ఏ వెలజాణలైనఁ గమలేక్షణల న్మణిమంత్రతంత్ర వి
ద్యానవచాతురీమహిమనైనను మందులనైన నీశ్వర
జ్ఞానము మాన్పి కామసుఖసక్తులఁ జేసిరయేని యిత్తుఁ గా
నైనను బుచ్చుకోక కమలాస్యల కన్నటికంబు వారికిన్. 49

ఈశ్వరుఁడు త్రోవలో వేశ్యలం గాపాడుట.

శా. ఈరీతిం గుమతోక్తులక్ జనని తమ్మిట్లాడింప నారాటముక్
బోరాటంబు ఘనంబులైనఁ బరశంభుం గాళహస్తీశ్వరుక్
జేరంబోవక మానరింక మదిలోఁ జింతింప నిప్పట నె
వ్వారిచ్చోటికి నమ్ము నెమ్మిఁ గొనిపోవక్ శక్తు లుద్యుక్తులై. 50

క. ఏధన్యులు మము హిమగిరిజాధవునిం గాళహస్తిసర్వేశ్వరునిక్
బోధముయుక్ సంసారాంబోధితరణిఁ గొలువఁ దోడుకపోయెద రనుచున్. 51

మ. తలపోయం దమవంచకిన్నియల మీఁదం జంగముల్ పోలె ని
చ్చలు దొంగుండెడు కన్నగాండ్రు విని రాజద్వారముల్ సొచ్చి కా
వలికాండ్రం గనుఁబ్రామి దొప్పడఁచి త్రోవల్ దప్పిపో నేల యిం
తుల నమ్మించినఁ గాళహస్తి కని వత్తుర్ దక్కుఁ దద్ద్రవ్యముల్. 52

మ. అని యక్కన్యలఁ జేరఁగాఁ బిలిచి యేలా తల్లితోఁ బోరఁగాఁ
బనిలే దాతిరు కాళహస్తిపతిఁ జూపక్ మాది భారంబు, మా
వెనువెంటం జనుదెండు, నమ్ముఁడు నిశావేళం బ్రయాణంబు రం
డన భక్తిక్ శరణార్థిఁ జేసి తమసోహం బెల్లఁ జెల్లించుచున్. 53

సీ. కట్టిన చెంగావి గుడ్డలమొలకట్టుఁ, బొంకపుఁదామ్రితాటంకములును
వివిధవస్త్రచ్ఛేదవిరచిత కంథలుఁ, బూత విభూతి త్రిపుండ్రకములుఁ
గరమూలముల వ్రేలుకప్పెరల్ జోలెలు, భద్ర రుద్రాక్షనైపథ్యకములు
శివసూత్రబంధభాసిత శంభులింగముల్, కట్టిన కుఱుమాపుఁబుట్టములును

తే. చిగురు డాకేల భసిత భ♦స్త్రికలుఁ దనర, దాంగజంగము దెలియింప♦జంగమాంగ
నావిలాసంబుఁ గైకొని♦నళినముఖులు, కాళహస్తీశు దర్శించు♦కాంక్షఁగదలి. 54

ఉ. ఇద్దఱు కింటిబిడ్డల న♦నేకధనంబులు వారి చేతికి౯
ముద్దియ లిచ్చి యాతపసి♦ముచ్చ్యల వచ్చి గృహంబు పాడుగా
నద్దమరేయిఁ బోయిరి శి♦వా యని పల్కుచు నెంతకాముక౯
బొద్దు పొడుపు నం బోవున♦భూధరకూటము లెక్కి డిగ్గుచున్. 55

వేశ్య లిర్వురును గాళహస్తికిఁ బయనంబగుట.

తే. తప్పుత్రోవల నీక్షింపఁ♦జొప్పు మీర్చి, కుంభకోణంబునకు శాత♦కుంభ కుంభ
ఘనపయోధరకుంభిలు♦గడచి చనిరి, భేశరేఖావతంసుఁ గుం♦భేశుఁ గొలువ.

ఉ. అక్కడనుండి వారు సుఖ♦మైన ప్రయాణమునం జిదంబరం౯
మ్రొక్కులు యిక్కడ తాండవన♦ముద్ధప్రసాదనిపాతితాంగదు౯
వాక్యము లేశ మానసని♦వాసభవు౯ శివకామసుందరీ
బ్రక్కన నారతంబుఁ జెడఁ♦బాయఁగ నీని జితాంగసంభవున్. 57

క. కలిభంజనదక్షుఁ బతం, జలిమాని వ్యాఘ్రపాద♦సంయమిపూజా
ఫలమూర్తి౯ గనకసభా, నిలయు వినయనమ్రచేతుల♦నిటలోగ్రాక్షున్. 58

క. వచ్చి భజియించి రచ్చో, నుచ్చరదంబుచరచంద్ర♦మోగ్రిస్వనమై
యుచ్చావచవీచీపా, టచ్చాదిహ్రాతవియదసితవ♦టంబగు నబ్ధిన్. 59

సీ. దరిఁదన్ని తిరిగెడు♦తరఁగలు చనుదెంచు, తరఁగలు కొండకోటిఁ♦దాఁకు రవము
గుములు గూడుక కంధ♦రము కానను డిగ్గి, నీరంబుఁ గ్రోలెడు♦నిబిడరవము
మబ్బునఁ గన రత్తి♦యుబ్బి యంతంతకుఁ, బొరలంగఁ బడియెడు♦భూరిరవము
ననుదినపూర్వాప♦రాహ్ణ వేళలఁ బోటు, పొడిచి విచ్చినకోటి♦ఘోర రవము

తే. దశదిశాభాగములఁ బ్రతి♦ధ్వనులనీన, వలయు శైలాది గిరిగుహా♦వాససింహ
శరభ శార్దూల హృదయభీ♦కరములగుచుఁ, దనరు నైజంబులుగ మించు♦వనధి రాజు.

క. భంగపటస్ఫురఘుట్టన, భంగసముద్భూత బిందు♦పటలంబు మగు
త్తుంగవులకుఁ దానొసఁగున, భంగుర మౌక్తికవితాన♦భంగిం దనరెన్. 61

క. రత్నము లిభరత్నముఁ దరు, రత్న వధూరత్న ధేను♦రత్నంబులు గ్లౌ
రత్న మమృతరత్నము హరి, రత్నమునుం గలిగి మెఱయు♦రత్నాకరమున్. 62

సీ. తనయందుఁ బజ్వాలిం♦చిన నీలవర్ణుని, నీడ నీరం బెల్ల♦నిండె ననఁగఁ
హేళికి నోడి తా♦నెటకుఁ బాఱఁగ లేక, తనయందుఁ దిమిరంబు♦దాఁగె ననఁగఁ
దనయందు బడబాగ్ని♦ఘనతరజ్వాలలు, మండఁగ నుదరంబు♦మాఁడె ననఁగ
జంబూఫలద్యుతి♦సంబరం బంతయుఁ, దనయందుఁ బ్రతిఫలిం♦చినది యనఁగ

తే. నీరదవ్రాత ఘురుఘురాంత • నీలకణ్ఠ, లాతసీపుష్ప కస్తూరి • కాళికాతి
సన్నిభచ్ఛాయఁ గనుపట్టు • నాగరేంద్రుఁ, గాంచి రద్దేవు పూర్వభా • గమున వారు
ఉ. అచ్చట బ్రమ్ముచ్చులుగ జలకు • హోత్రులును బయనంబుఁ జేసి వే
వచ్చిన నొప్పిఁ దీర్చుకొని • వర్ణముఖిన్ శివకామసుందరీ
జిచ్చుఆకంటి కావాలితికిఁ • జిత్తజుఁ జేసిన యొజ్జఁ దాండవం
బిచ్చల నింగి రచ్చ సేచి • యించిన కర్తకునిఁ భజించుచున్. 64
వ. మూఁడవనాఁ డాపురంబు రేపకడ వెడలి యడవి నడుమ నడచుచున్నంత. 65

దొంగలయత్నంబులు నెల్లఁ బరమశివుఁడు వారించుట.

ఉ. ఇక్కడఁ గూయి చెవ్వటను • నెంతయు మాఱుఁబొప్పు మార్చిపో
నిక్కడ వైపు పట్టడవి • యిక్కడఁ జేరువ నూరు పల్లె లే
దిక్కడ నెవ్వరుం దినుగ • రిక్కడ నేఁడిదె ప్రొద్దు దోఁచుకో
నిక్కడ వాట మంచు మది • నెంచఁగ వారికి నక్కడక్కడన్. 66
ఉ. రాజును సేనయుం, శబర • రాజుఁ బుళింద భటాళియున్, వణి
గ్రాజును వైశ్యులుం, దపసి • రాజును శిష్యతతిం, గపాలభృ
ద్రాజును జోగిపింఛుఁ, బను • రక్షకరాజును గొల్లవాండ్రు నై
రాజధరుండు దోఁచు నుసు • రాజముఖ ననో రక్షణార్థమై. 67
శా. ఊరూర న్విడిదిండ్లఁ జంపుటకు ను • ద్యోగింపఁగా జంగమా
కారం బొప్పఁగ వచ్చి పూజఁగొని శ్రీ • కాళిద్విపేశుండు రమా
పారత్నంబులు కాత్మవిద్య యుపదే • శం బిచ్చి వ్యాజంబునన్
గారుణ్యంబున వారిసిద్ధ యుసుగం • గాఁ జేయు సత్కంబులన్. 68
శా. ఆదొంగల్ వెగి యిట్లు కృత్యములు సే • యం జూడఁగా దేవతా
చూడారత్నము వారియత్నముల కె • చ్చోఁ గూడకుండన్ సుఖ
క్రీడం గన్యలఁ గొంచుఁ బోఁ గనిరి భ • క్తిన్ ముందర న్నందర
క్రీడాకృత్తిరుకాళశైలకృదజ • శ్రీభంగళృంగంబులన్.
చ. కనుఁగొని యారణీతటినిఁ • గాంచుము దోఁచి తదీయ సైకతా
వని నభవుఁ భజించి యప • వర్గరమావిభు వాలిపూజసే
సిన శివలింగముం గొలిచి • సిద్ధుల కయ్యణిమాదిసిద్ధు లి
చ్చిన వరభైరవుఁ దలఁచి • చిత్తములోపలఁ దన్మహాత్మ్యమున్. 70
వ. తెలియఁగోరి యమగుటయు నప్పరాణజ్ఞు లగుపౌరు లిట్లనిరి. 71

వాలిపూజించిన శివలింగకథ.

ఉ. ఒక్కసరోవరం బిచట • నుండఁగఁ దొల్లి తదీయతీరమం
దక్కపిరాజు వాలి రచి • తానుఁడై తనసజ్జలింగము

న్నిక్కువు భక్తిఁ బీఠమున ♦ నిల్పి భజించుచు నుద్వసింపఁ జో
నక్కడ దేవుఁడుండఁ బ్రియ ♦ మందుచుఁ జేతికి రాక తక్కినన్. 72

క. ఒకచేతఁ బట్టి తివిసిన, నొకయింతయుఁ గదలకున్న ♦ నొగి మోఁకాలిం
చుక బలిమి రెండు చేతులఁ, బెకలింపఁగఁ బూనుటయును ♦ భేదిలకున్నన్. 73

ఉ. గ్రక్కున లేచి వాలమున ♦ గాఢతరంబుగఁ జుట్టి పిక్కలు
క్కొక్కఁగఁ ద్రొక్కి నిల్చి తను ♦ వించుక వంచి కరంబు లూరులన్
నొక్కి ముఖాంబుజంబునఁ ♦ గనుంగవఁ గెంపు జనింపఁ జేవమై
నిక్కఁగఁ గ్రుంగెఁ బాదములు ♦ నేలఁ జలింపదు లింగ మేమియున్. 74

క. వాలముబిగువున నతఁడి,క్కాలుని దేహంబు తఱుఁగు ♦ నవుటయు భీతిన్
జాలిఁబడి వాలి నేలకు, వ్రాలి ప్రణామంబు లెన్ని ♦ వలసినఁ జేసెన్. 75

క. చేసి మహేశ్వర నీకేఁ, జేసిన యపరాధ మెద్ది ♦ చిత్తంబున నన్
రోసితివొ భుజబల మెసఁగఁగఁ, దీసిన రాకైతి వేని ♦ తెఱఁగిందులకున్? 76

క. ఒకపూఁటయు నిను దర్శిం,పక యుండఁగ లేని నన్ను ♦ భక్తవరున్నిం
చుక నిమిషములో విడిచితి, వకటా నిష్కారణము కృ♦పాంబుధివయ్యున్. 77

సీ. నాపాలి మూలధ♦నంబవు నాపాలి, భాగ్యదేవతవు నా♦పాలి నిధివి
నాపాలి దేవర♦త్నమవు నాపాలిక,ల్పకపాదపమవు నా♦పాలి మతివి
నాపాలియిహసాధ ♦ నంబవు నాపాలి, పరసాధకుఁడవు నా♦పాలి గతివి
నాపాలి శుభకార♦ణంబవు నాపాలి, పరమపుణ్యమవు నా♦పాలి సిరివి

తే. దేవ నాపాలి దేవతా ♦ ధేనుమణివి, శూలి! నాపాలితంగేటి♦జున్న పీవ
నన్ను విడనాడఁ గతమెద్ది♦నతనిలింప! యేమి యపరాధ మొనరించి♦తీశయనుచు.

చ. పరశివలింగ మింద్రజుఁ గృ♦పామయదృష్టిని జూచి యేటికిన్
బొరలఁగఁ జత్తి మీఁకొలని ♦ పొంత వసింపఁగ వేడుకైన సు
స్థిరగతి నిల్చినాఁడ విర♦తి న్నినుఁ బాసిన వాఁడఁ గాను ద
త్పరత భజింపు మెప్పటివి♦ధంబున నీ మదిలోన నుండెదన్. 79

చ. అని తనసజ్జలింగము ద♦యాతిశయంబున నానతిచ్చిన
న్ననిని యిచట న్వసింతు నను ♦ వేడుక దీఱ సరోవరంబుఁ బూ
డ్చినఁ దనయంత శంకరుఁడు ♦ చేతికి వచ్చునటంచు గోత్రభి
త్తనయుఁడు నిమ్మహానగము ♦ దానిపయి న్వడిఁ దెచ్చి వైచినన్. 80

క. దశదిశలఁ దత్సరోవర,విశదపయఃపూర ముబ్బి ♦ వెడలఁగఁ దొడఁగెన్
శశిధరునిదండ దక్షిణ, దిశ నిర్ఝరజలము ధరణిఁ ♦ దేఱుచుఁ బొడమెన్. 81

మ. ఇది తీర్థోత్తమ మిందు నాఁడిన నరుం ♦ డీఘోరసంసారదుః
ఖదవాగ్నివ్యథఁ బాయుఁ బంకరుహద్భ ♦ క్కంజాతగర్భాదిక

త్రిదశుల్ గూడి చరింతు రిందు నని మా♦ద్రిప్రాప్తియా శైరవా
స్పద మిట్టొండెఁ జరించుచుందు నుమతో ♦ సర్వేశ్వరుం డిమ్ములన్. 82

సీ. ఎఱుకు లీగిరి మీఁద ♦ నిత్యంబు ద్రిమ్మర నయో, మయసాధనములు హే♦మంబు లగును
శబరులు మృగములఁ ♦ జంపి యిమ్ముల గ్రగ్గి, వచ్చునాలో నజీ♦వంబు లగును
వ్యాధు లీకొండపై ♦ వన్యాశనంబులు, సేవింపఁగాఁ గాయ♦సిద్ధి యగును
జెంచు లీయద్రి ని♦ద్రించి మేల్కొనువేళఁ, దమవధూటులు తల్ప♦తలము లగును
తే. దృశ్యమగువారి కిందు ని♦ధివ్రజంబు, దృశ్యమగుఁ గూసితమతోడఁ ♦ దిరుగుజనము
విస్మయముఁ జెప్ప నొక్కొక్క♦వేళ దీని, సానుభూముల మహిమాతి♦శయవిధంబు.

క. వానవసుతుఁ డాలింగముఁ, బాసి చనఁగ లేక గాసిఁ ♦ బడియుం దనుఁ దా
రోసియుఁ బలునిట్టూర్పులు, సేసియు నాఁడెల్ల నుపవ♦సించుచుఁ జనియెన్. 84

మ. ఇది యీ తీర్థమహత్త్వ మీ మహిమ వా♦ణీశ ద్విజిహ్వేశులుం
దుదిముట్ట న్వినుతింప లేరు నరమా♦త్రుల్ చెప్పఁగా శక్తులే?
సుదతీ రత్నములార! మీరు పరమే♦శుం గొల్చి యీప్రొద్దు నె
మ్మది నిచ్చోట వసించి పొందనఁగ రా♦మల్ సంతసం బందుచున్. 85

ఉ. మజ్జన భోజనాదులకు ♦ మావు శయించుటకుం వధూమణుల్
సజ్జన గేహమొక్కటి వి♦చారము చేసి యొనర్చి వారిపైఁ
సజ్జఁ దొలంగి యచ్చటఁ ద్ర♦సన్నత నిల్చిన లింగముం భవా
వజ్జలరాశికుంభజుని ♦ భక్తి భజింపఁగఁ బోవునంతటన్. 86

## సూర్యాస్తమయాదివర్ణనము.

శా. సాయంకాలరఘుక్షితీశ్వరుఁడు కెం♦జాయ న్ముఖం బొప్పఁగా
డాయ న్వచ్చి తమిస్రసతీవ్రతతర కాం♦డధ్వస్తపాదంబుగాఁ
జేయం జక్రవధూధరాసుతకు వి♦శ్లేషవ్యథాపాదియై
మాయాహేమమృగంబునాఁ బడియె న♦మ్మార్తాండుఁ డస్తాద్రిపై 87

క. పంకేరుహ ప్రతిబింబము, గ్రుంకఁగఁ దిమిరం బజాండ♦గోళము నిండెన్
శంకాతమఃపరంపర, శంకరచిద్రహితమాన♦సంబును బోలెన్. 88

తే. తపనుఁ డుదయింపఁ గద్బింబ ♦ దర్శనమున, లోకపాతకపటలంబు ♦ లోఁగిపటిచి
యతఁడు గ్రుంకినఁ జనుదెంచె ♦ ననఁగఁ బర్వి, యంధకారంబు జగమెల్ల♦నాక్రమించె

సీ. వామాంగభామినీ ♦ శ్యామధామాళియుఁ, గంఠహాలాహల♦కాళిమంబు
నాకాశకేశపా♦శాసితచ్ఛాయయుఁ, జూళికాసింధుశై♦వాలరుచియుఁ
గరకృష్ణసారాగ్ని ♦ ఘనధూమనీలిమ, శేషభూషణఫణా♦సీమనలుపుఁ
గటితటకీలిత ♦ కరటిచర్మద్యుతి, మేచకశూలశో♦భాచయంబు

తే. భువనలోచను పైనెత్తి ♦ పోవునంధ, కారబృందంబునకుఁ దోడు ♦ గాఁగఁగూర్చి
వెనుక నేతెంచుభూతేశు ♦ విధముదనరఁ, జంద్రుఁడుదయాద్రిపై నొప్పె ♦ సాంద్రకాంతి.

చ. తిమిరదినేంద్రజాలములఁ ♦ దెచ్చి యజాండఘటంబునందుఁ బో
సి మరలఁ బశ్చిమాశ యను ♦ చెల్వ వహించిన పద్మరాగకుం
భముగతి సూర్యుఁడుం జనియెఁ ♦ బ్రాక్సతి వెన్నెల వెల్లువేటి తో
యము వడఁ బోయు హేమకల ♦ శాకృతిఁ జందురుఁడు నొప్పె నయ్యెడన్. 91

ఉ. కాముకహృద్దధిం గలఁచు ♦ కవ్వము బువ్వము దేవలోకికిన్,
వ్యోమపథంబు తేనె పెర ♦ కొప్పెడు పర్వము మువ్వముత్పల
శ్రీమతికిన్, జకోరమహి ♦ మీసుధుసాళికిఁ బోచుసన్నమై
యామవతీశబింబ ముద ♦ యాచల మెక్కెఁ బ్రభాళి పిక్కువన్. 92

ఉ. వెన్నెలగుజ్జు నంజుకొని ♦ వెన్నెలప్రోవు భుజించి, నాలిక
న్వెన్నెలగ్రోజ్జుఁ జాలఁగొని ♦ వెన్నెలతేటలఁ ద్రావి వేమరున్
వెన్నెలక్రాను జల్లుకొని ♦ వీథులయందుఁ జకోరదంపతుల్
మిన్నులుముట్టి వెన్నెలలు ♦ మేపుచుఁ బిల్లలఁ దాము నాడఁగన్. 93

క. వాలిశ్వాసభైరవులం, బాలికలు భజించి భూష ♦ పతి సభవుని శ్రీ
కాళద్విపేశు మదిలోఁ, గీలించుచు విడిదియింటి ♦ కిం జని పిదపన్. 94

క. ఆజంగములును దారును, భోజన మొనరించి వారి ♦ పూజించిరయా
రాజకళాధరుచరితము, రాజముఖులు చదువుకొనుచు ♦ రాజిల్లంగన్. 95

శా. తారాపోత్థములం గాలసూతుఁడు వియ ♦ ద్వారాశి వేఁటాడి ప్రా
గ్ఘారంభం బను బుట్టఁ బట్టి నుఱివా ♦ యం గుంజి యీఁదాఱఁ జె
న్నారన్ వైచిన జాలమో యనఁగ శో ♦ భాకించనత్వంబునన్
దారానాయకమండలం బమరె న ♦ స్తగ్రావకూటంబునన్. 96

ఉ. చీఁకటికానచిచ్చు, భవు ♦ చేలకుసుంభము, తూర్పుకొండకున్
గూఁకటి రత్న, మబ్జరమ ♦ కూరిమిపంట, చకోరరాజిపే
రాఁకటిమంట, శోణకిర ♦ ణావళిగంట, రథాంగకేళికిం
దేఁకువపెంట, మింటఁ జను ♦ దెంచె దినేంద్రుఁడు కాలఘుంటమై. 97

క. అంతట భక్తస్వాంతుని, శాంతు నుమాకాంతు హరు ని ♦ శాంతసపర్యన్
గాంతలు సేవించుచు నా, శాంతంబుల నిండమొలక ♦ లలరఁ బయున్నమై. 98

దొంగలు విఫలమనోరథులై చనుట.

ఉ. నాఁ డొకపల్లె కేగి మఱి ♦ నాఁ డుదయార్చన సేయఁ గోరి పూఁ
బోఁడులు భూరిసత్త్వకుల ♦ భూత్కృతి ఝాంకృతి ఘుర్ఘురధ్వనుల్

గాంఢీ చెవుల్ వగుల్ప ఘన♦కాననమధ్యనర న్నటంబునన్
మూఁడవకంటి వేల్పుఁ దమ♦ముందరఁ బెట్టుక నిశ్చలస్థితిన్. 99

శా. ఆరాధింపఁగ దొంగజంగములు నేఁ♦ డజ్ఞాన్యులం బంపి భూ
షారత్నాదిధనంబుఁ బుచ్చుకొని యి♦చ్ఛావృత్తిఁ బోవచ్చుఁ గాం
తారంబుల్ వడి నిర్గమించి యటుగా♦ దా మాకు సేనంబునన్
జేరంబోదురు కాళహస్తి కనుచుం ♦ జింతింపఁగా సంతటన్. 100

శా. అప్పా పాత్ములరిష్టసాధ్వసము నే♦యం జెల్లియల్ మెల్లనే
యప్పా! మా కన్నులన్నుఁ గన్న నని యో♦యమ్మా! పరా కేటికే
చెప్పం జూపఁగరాని లోకజనకున్ ♦ శ్రీకాళహస్తీశు మా
యప్పయ్యన్ భజియింప నేమిటిని నే♦ నయ్యె న్నగం జూడవే. 101

క. నాపుణ్యఁ దదేకనిష్ఠా, పావన ధ్యానసమాధిఁ ♦ బరవశు లగుచున్
సేవింపఁగా సంతతుఁ, బూపుంబోఁడులకు వేడ్క ♦ పుట్టం గరుణన్. 102

సీ. శ్రీకాళహస్తిగా♦రీపతి స్తోత్రముల్, పట్టిన తెలిబూది♦ పండెకట్లు
గళముల గుఱుబోడ♦ తలల రుద్రాక్షముల్, గండచుట్టాము♦ కుండలములు
ధాతు రాగాంగవ♦ స్త్రమ్ములు గోఁచులు, నడుముపంచేయుల♦ నెనఁగుసజ్జ
లును దీర్ఘధారనం♦బునఁ బుట్టు నేమంబు, జెదరి పువ్వులు గోయు♦శీఘ్రగతులు

తే. గలుగు ప్రముఖులకోడ శ్రీ♦ కాళహస్తి, శివుఁడు సనుదెంచెఁ దనుఁ బూజ♦ సేయ వలచి
పత్రపుష్పఫలంబులు♦ భక్తిఁ దెచ్చు, ప్రవిమలజంగమ వేషంబు ♦ లవధరించి. 103

క. ఆకలికలనుఁ జిక్కం, బాకులతం బొంద నొంగ ♦ లడవులపాలై
కాకుల కెఱఁగునఁ జని రే, కాకు లగుచు నొకరి నొకరు ♦ గానక భీతిన్. 104

—వృద్ధస్త్రీలును సాయుజ్యంబు వడయుట.—

క. మదనారియు నాపిమ్మట, సుదతులఁ గవియంగఁ బోయి♦ చూపులఁ గరుణం
బొదలఁ గనుంగొని వారల, నిది యేమి యిచ్చోటనుండ ♦ నిటువలె నన్నన్. 105

శా. ఆయయ్యన్ గని మొక్కి ధన్య లగుక♦న్యల్ దమ్ము నమ్మించి యు
మ్మా యీ జంగము లిచ్చఁ దెచ్చుటయు నా♦త్మస్వర్ణభూషాదు ల
న్యాయంబూని హరింపఁ బూనుటయుఁ దా ♦ రచ్చోటి కాలోన వి
చ్చేయం గన్గొని దొంగ లేగినదియుం ♦ జెప్పం గృపామూర్తియై. 106

క. మాయమ్మలార! కరుణా, లయనిధిం గాళహస్తి♦తుహినాంశుధరున్
శ్రేయోనిధి నారాధన, సేయుం గొనిపోయెదము ప్ర♦చింత యుడుగుఁడీ. 107

వ. అని యాదరించి తలోదరుల ముందరఁ బెట్టుక నెట్టుకొని జీవులంగొట్టురట్టునకొడి
గట్టువేఁటువుగట్టివాయుదెస వెంకిగట్టు వాయులేక తోకొనిపోవఁ ద్రోవ నావన దేవ

